# Viharaleela.



(SHAKESPEARE'S TWELFTH-NIUHT)

*Author:—*
**D. Gopalakristna Rao, B. A.,**
COCANADA.

కాకినాడ నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి

ఆరవకుసుమము.

# విహారశ్రీల.

అపర కాళిదాసని పిలువఁదగిన షేక్సిపియర్, (Shakespeare)
మహాకవిచే రచింపఁబడిన
Twelfth Night—నాటకము ననుసరించి
వ్యాసావళి, శ్రీకృష్ణావతారము, వనసుందరి మొదలగు పది
నాటకములు వ్రాసిన

మధ్వశ్రీ దొల్తాబాదా గోపాలకృష్ణారావు, B. A.,
గారిచే రచింపఁబడి ప్రకటింపఁబడెను.

మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:

రంగా అండ్ కో., యందు ముద్రింపఁబడెను.

1933.



[వెల రు. 0-12-0.

# నాట్యకళా విజ్ఞాన గ్రంథ మండలి.



## రాజపోషకులు :—

1 మ॥రా॥రా॥ యస్. బలరామమూర్తినాయుడుగారు, బి. ఏ., బి. యల్., చెన్నపట్టణం.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి. ఏ., సబ్ మేజిస్ట్రేటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుఁడుగారు డి. పి. డబ్లియూ ఆసిస్టాంటు ఇంజనీరు. పెన్షనర్ లింగారెడ్డిపాలెం.

4 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు, చెన్నపట్నం.

## పోషకులు :—

5 ,, పైడా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సు, జమీందార్సు, కాకినాడ.

6 ,, వారణాసి బాపయ్యగారు, బి. ఏ, క్యాషియరు, డి. కో. బ్యాంకి, చెన్నపట్నం.

7 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు, రామచంద్రపురం.

8 ,, మాజేటి మునెయ్యగారు, బి ఏ., బి. ఎల్., రాజమండ్రి.

9 ,, ముత్తా సత్యప్రసన్నం బ్రదర్సు, బ్యాంకర్సు, కాకినాడ.

10 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఉకిరెపల్లి.

11 ,, వెలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.

12 ,, చిత్రపు సుబ్బారావుపంతులుగారు, తహశీలుదారు, అవనిగడ్డ.

13 ,, చిర్రావూరు కామేశ్వరరావుగారు, అవనిగడ్డ.

14 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు, పురుషోత్తపట్నము.

15 ,, దర్భా వెంకటశివరామరావ్, బి.ఏ , బి.యల్., కాకినాడ.

16 ,, చెలికాని రామస్వామిబాబుగారు, అసిస్టెంటు యింజనీరు, సామర్లకోట.

17 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు ప్లీడరు, కాకినాడ.

18 ,, కొత్త వెంకటరత్నంగారు, Officer D. Acadimie Chevaliver de L-Eloile Noire de. Benin Conseille Municipal, Yanam.

19 ,, దగిసె వెంకటేశ్వరరావుగారు, గుడివాడ.

20 ,, కె. వి. రమణారావుగారు Representative Confectionery Dept Parry & Co Ltd , Madras.

21 ,, జమ్మి వెంకటసుబ్బారావుపంతులుగారు, Tq. Office, Cocanada.

22 ,, పైడా సూర్యనారాయణమూర్తిగారు, జమీందారు, బ్యాంకరు, కాకినాడ.

23 ,, యం. వి. రాజరత్నంగారు బి. ఏ., D. B. E. Office, కాకినాడ.

24 ,, శ్రీ జిల్లెళ్ల తిరుమలవెంకటలక్ష్మీబాయమ్మగారు, Guardian, Minor. Zamindar of Vilasa, Jalamudi etc., Perur.

25 ,, ధరణిప్రగడ బాపిరాజుగారు, Taluk Office, Cocanada.

26 ,, Nandagiri V. Ramadas Pantulu garu, Proprietar, Mukundapuram Estate.

# ఉపోద్ఘాతము.



నాటకములు నవలలు స్వల్పముగా నుండుటచే యాంధ్రమునకు ప్రస్తుతమందున్న కొఱత. అందు ముఖ్యముగాఁ జరిత్రాత్మకములు సాంఘికములు కావలసియున్నవి. ఈలోపమును బూర్తిగా మొదట గ్రహించినవారధునిక నటశేఖరులే. నటనాకౌశలము వారికున్నను భాషయందుఁ గవనముచెప్పుటలోఁ బ్రవీణులు కానందున వారికిఁ దోచినమాటలఁగూర్చి సాంఘిక నాటకములనుపేర విచిత్రప్రదర్శనములఁ జేయుచున్నారు. నీచభాష నుపయోగించి యల్పుల కరతాళములతో సంతుష్టిచెందుచున్నారు. పాపము. వారి ననఁబనిలేదు. మంచి సాంఘికనాటకముల వ్రాసియిచ్చిన వారేల ప్రదర్శింపరు ? కవులు ధనాపేక్షాపరులై కవికట్నముల నపేక్షించి నాటకముల నివ్వకున్నారు. ఇట్టి సందిగ్ధసమయమున మంచి సాంఘిక నాటకములుండిన బాగుండునని యపరకాళిదాసనఁదగు షేక్స్పియర్ (Shakespeare) మహాకవిచే రచింపఁబడిన Twelfth-Night నాటకమును హిందూరంగస్థలమునఁ బ్రదర్శనమునకనుగుణ్యముగా గొన్ని స్వల్పమార్పులతో నాంధ్రమున సులభశైలిని వ్రాసి ప్రకటించినాడ. ఇది షేక్స్పియర్ వ్రాసిన కామెడీలలో నన్నిటికన్న శ్రేష్టమని పరిగణింపఁబడుచున్నది. హాస్య శృంగార రస భూయిష్టమై ధనికులకు, బీదలకు, పామరులకు, పండితులకుఁ బెక్కునీతుల బోధించు సాంఘికనాటకము. నా స్వంతమేమియు నిందులేదు. భావము, చమత్కారము షేక్స్పియర్ దే—ఇట్టి గంభీరనాటకరచన వెల్లడి చేయనెంచి ప్రథమమున నీనాటకము ప్రదర్శించినవారి నాయకీనాయక పాత్రలకు బంగారుపతకముల నిచ్చునట్లు కాకినాడ నాట్యకళా మండలివారిని బ్రార్థించియుంటిని. నటుల కుత్సాహముకలిగి ప్రోత్సాహపడుదురు గాక.

కాకినాడ,
20-10-33.

దౌల్తాబాదా గోపాలకృష్ణారావు, బి. ఏ.,

# పాత్రలు



1. కామపాలుఁడు. Orsino. విశాఖపట్నం జమీందారు.
2. మాధవరావు. Sebastian. లీలయన్న.
3. లీల. Viola. నాగరాజు కూతురు.
4. పద్మినీదేవి. Olivia. విశాఖపట్నంలో ధనికురాలు.
5. నౌకాధ్యక్షుఁడు. Sea Captain. ఓడకధిపతి.
6. సంజీవరావు. Antonio. మాధవరావు స్నేహితుఁడు.
7. చతురిక. Maria. పద్మిని చెలికత్తె.
8. వినోదప్రియుఁడు. Clown. పద్మిని విదూషకుఁడు.
9. నిత్యానందరావు. Sir Toby Belch. పద్మిని మేనమామ.
10. నారాయణరావు. Sir Andrew Aguecheek ధనవంతుఁడు
11. భాస్కరరావు. Cesario. పురుషవేషముతోనున్న లీల.
12. వెంకన్నదీక్షితులు. Sir Topas. భూతవైద్యుని వేషముతోనున్న విదూషకుఁడు.
13. భీమారావు. Malvolio పద్మిని వంటలకధికారి.
14. సుశర్మ. Valentine. మంత్రి.

15 1టో భటుఁడు. }
16 2డో భటుఁడు. } Offiicers &c.




నాంది.

ఉ॥ చాపముతియ్యదంటు, శర జాలముపువ్వులు మూఁడు రెండెయా
టోపములేని సైన్యము, పటుత్వములేని గుణంబు తుమ్మెదల్,
రూపములేకనే మదన! రూఢిజగంబుల నేచునట్టినీ,
ప్రాపునుగోరి వేడితిమి పంతముఁబూనకుమయ్య మాపయిన్.

## మొదటియంకము — మొదటిరంగము.

(ఓడ సముద్రములో మునిగిపోవుచుండును.)

నౌకాధ్యక్షుఁడు — తుపాను మిక్కుటమైనది. తెరచాపలు విరిగిపడినవి. లంగరు దింపవీలులేదు. ఓడ నీటితో నిండిపోవుచున్నది. మిత్రులారా! మనకందరకు నేక కాలమరణము తటస్థించఁబోవుచున్నది. లెండు, దైవమునుఁ బ్రార్థింపుడు.

(సముద్రములోనుండి లీల పైకివచ్చును.)

లీల —

చ॥ విడచితిసోదరున్ జలధి వీచికలంబడి పోవువానినే
మడయుక చేరితిన్ దరికి మార్గముగానఁగరాదు, భూమిపై
నడువ జవఁబులేదు, జన నాశమువచ్చె నికేమిచేతునో!
పుడమికివచ్చు టేల? సుర భూములులేవె విహారకేళికిన్?

భూలోకవిహారకాంక్ష జనింప, నాగలోకము విడనాడితి. ఈతుపాను వలన నాప్రియసోదరుని, మాధవుని, సముద్రమునకొప్పగించితి. నాకేమిదిక్కు?

(నౌకాధ్యక్షుఁడు ప్రవేశము.)

నౌకా—అమ్మా! బ్రతికియుంటివా?

లీల—నాయన్న యేమయ్యెనో?

నౌకా—ఓడకంబము నంటిపెట్టుకొని యలలవెంబడి వాయువేగమునఁ గొట్టుకఁబోవుచుండఁ గాంచితి. ప్రాణభయము రాఁగూడదు.

లీల—నౌకాధిపతి! ముందు మనకేమిగతి? ఈదేశమెవరిది?

నౌకా—ఇది కళింగదేశము. విశాఖపట్టణమిచ్చటికిఁ గడుసమీపము. అందుఁ గామపాలుఁడనురాజు కలఁడు. మంచివాఁడు. సమస్తకళలఁ గడతేరినవాఁడు. నీవుమాత్రము స్త్రీరూపమున నందుఁ బ్రవేశింపవలదు. నాయొద్ద నావికాధ్యక్షున కర్హమగు దుస్తులున్నవి. వానిధరించి పురుషవేషమున నతని గొలువుకూటముఁజొచ్చి యందలి విచిత్రములఁ బరికింపుము.

లీల—ఇతఁడు మిక్కిలి పరోపకారబుద్ధికలవాఁడు. మిత్రమా! ఆపత్కాలమున నీయుపదేశము శిరసావహించెద. కామపాలుని సద్గుణంబులిదివరకే వినియున్నాను. అతఁడింకను బ్రహ్మచర్యమే జరుపుచున్నాఁడా?

నౌకా—నెలకిందటివరకతనికి వివాహముకాలేదు. పద్మినియను గొప్పధనికురాలా పట్టణమందుఁగలదు. మిక్కిలి సౌందర్యవతి. ఆమెయందు బద్ధానురాగుఁడైయున్నట్లు కర్ణాకర్ణి వినుచుంటి.

లీల—ఆమె కామపాలుని వరించెనా?

నౌకా—లేదు. లేదు. ఇతనిసందేశముల సహితము వినుటలేదట. ఆమెతండ్రి కొలదికాలముక్రిందఁ బరలోకగతుఁడయ్యెనట. ఆ దుఃఖముచేఁ గామపాలసేవకులఁ జూడనొల్లనని చెప్పుచున్నదట.

లీల—ఇది మంచిసందర్భమే. కామపాలునియొద్ద సుద్యోగినై యీవినోదము జూచెదఁగాక. విశాఖపట్టణమునకు దారితీయుము.

(నిష్క్రమింతురు.)

---

## రెండవరంగము—కామపాలుని మందిరము.

### సంగీత సభ.

కామ—గీ॥ ఫణులశిశువుల జోకొట్టి పడఁబెట్టు
పశుగణంబుల నిలఁబెట్టి వశముఁజేయు
శిలఁగరగించు సంగీత రసము, మనసు
కరుగఁజేయకయుండునా ? కలతఁబాపి.

వినోదప్రియా ! మొన్న పద్మినీగృహంబునఁ బాడితివట. ఏది యాజాపిళ్లీ ?

వినో—ఏమో ! ఆధానళి పెట్టెలోఁబెట్టి తాళము వేసినాను. పట్టుకవత్తునా ?

కామ—మొన్న పాడినపాట పాడుము.

వినో—పాటా ? ఉ—ఆ—ఏ—

ధన్యాసిరాగము.

ప॥ ఏమిచెప్పనే సరోజనేత్రి యేమనివర్ణింతు
ఎంతచెప్పితే యంతేచాలు వేడుకలలరారు॥

చ॥ ముక్కునపీల్చిన పోగాకు పొడుముపీల్చినయట్లుండు
టక్కులు నిక్కులుజూచితే పొట్టచెక్కలౌను నవ్వు. (ఏమి)
బట్టతలకుఁ బుత్తడిసొగసౌనె తట్టుచుండు బల్లిని
కట్టినఘట్టము కాల్చినకాలదు కట్టివిడువ డెప్పుడు, (ఏమి)
వారచూపులకు వంకగోచికి వందనములు సేతు
నెరసినగడ్డముజూచితె గుండెఝల్లుమనుచునుండె. (ఏమి)

కామ—చాలు ! కామావేశమునఁ బరవశమైయున్న నా మానసమందితరములకుఁ జోటులేదు. సంగీతము మంచిదే. నాకిప్పుడది రుచించుటలేదు.

వినో—రాజా ! మితిమీరితినుటచే గారెలు, బూరెలు నాకు రుచించనట్లు సంగీతమువినిన మీకు విసుకుపుట్టుచున్నది కాబోలు.

కామ—సుశర్మ వెళ్లి తడవాయె. ఇంకను రాఁడేమి? పద్మిని నాసందేశమంగీకరించునా?

వినో—అదే యాకాశకుసుమము-కుందేటికొమ్ము.

(సుశర్మ ప్రవేశము.)

సుశ—దేవా! పద్మినీదేవిగారు తండ్రిగారి వియోగమును సహింపలేక నెవరికి దర్శనమిచ్చుటలేదట. నన్నుఁ దలవాకిటనుండియే పంపివేసిరి.

కామ—జనకునియెడల నామెకుఁ బ్రేమ యపారము. నాయందేల తదర్ధంబుండరాదు?

వినో—తండ్రిగారు స్వర్గస్థులైనవెనుక నామెకుఁ బ్రేమయతిశయించినది. భూలోకవాసులకది యలవికానట్లున్నది.

సుశ—దేవా! వేటాడిన మీకు మనశ్శాంతి కొంతకలుగునేమో!

కామ—గీ॥ పద్మినీ వాలుచూపులు ౯ పంతమూని
వేఁటలాడుచునన్ సదా ౯ వెంబడింప
నాదుకోర్కులు కుక్కలై ౯ నన్నుఁదరుమ
నేమిసేయంగ నోపనో? ౯ యేలవేట?

కామజ్వరపీడితులకుఁ బొదరిళ్లు శరణ్యములందురు. అందుఁజొరఁబడుదము రండు.

(భాస్కరరావు ప్రవేశము—పురుషవేషముతోనున్నలీల.)

భాస్క—(స్వగ) మందుమ్రాకులకన్న మంచితనమే దివ్యౌషధము.

గీ॥ పెద్దపులులతోఁ జెలిమి బల్ ౯ పెంపవచ్చు
సింగములఁబట్టి భృత్యులఁ ౯ జేయవచ్చు
సిరులసంపదలింతలోఁ ౯ జేర్పవచ్చు
మంచిమనకున్న సర్వంబు ౯ మనదెసుమ్మ.

కామపాలుఁడు నామంచితనమను వలలోఁ బడకమానఁడు.

(ప్రకాశముగా) కామపాలరాజచూడామణీ! జయము జయము.

కామ—ఈయువకుఁడెవ్వఁడై యుండు. వీని ముఖారవిందముగాంచిన నామానసము పూర్ణచంద్రోదయమున సముద్రము పొంగినట్లు

పొంగి పొరలుచున్నది. వీని సౌందర్య మనుపమానము. తేజ మతిగంభీరము. బాలకా! నీవెవ్వఁడవు? ఎందునిమిత్తమైనీరాక?

భాస్క—దేవా! నేనొక దేశదిమ్మరిని. నాపేరు భాస్కరుఁడు. వింతలఁగాంచి యానందించుటే నాపని! తమకొలువుచేయ నరు గుదెంచితి.

కామ—నవశిరీషకోమలమగు నీదివ్యసుందర విగ్రహ మొకని సేవకై నిర్మింపఁబడినదికాదు. నీయిచ్ఛానుసారము నాయొద్దనుండి దేశ దేశములఁ జిత్రముల సందర్శింపుము. సుశర్మ! కొలువు చాలించితిమి! మీగృహంబుల కరుగుఁడు. భాస్కరరాయ! చిన్న వాఁడవైనను బుద్ధికిఁ గడుపెద్దవలె నున్నావు. ఇటురమ్ము. నాయొద్ద కూర్చొనుము.

భాస్క—మహాప్రసాదము! నేధన్యుఁడను. దేవా! ఆజ్ఞాపింపుము.

కామ—నాహృదయము సర్వము నీకెరింగించెద. ఇంచుకంతరహస్యము దాచను. ఈపట్టణమున పద్మినియను నొకయందగత్తె నా హృదయ మపహరించినది. కాని నాకామె వశమగుటలేదు. తండ్రిగారి వియోగదుఃఖనెపంబున నాసందేశముల సహితము వినుటలేదు. నీవాపద్మినీదేవికడ కేగి, నాకు మారుగా—

భాస్క—తండ్రిగారి వియోగదుఃఖముచే నాకు దర్శనమివ్వకున్న నేమి చేయవలయు?

కామ—గుమ్మము విడచిరావలదు. సందేశము విననిఁగాని వాకిలి విడువనని పట్టుపట్టి విడువకుము. మూర్ఖుఁడవని నిందింతురనుభయము వలదు. నానిమిత్తమది సహితము సహింపుము.

భాస్క—దర్శనం బిచ్చిన నేమి చెప్పునెదరు?

కామ—నావాక్యములుగా నిట్లనుము.

సీ॥ అర్ధచంద్రునిఁబోలు ఽ నతివ! నీనొసటిపై
వెలలేనిముద్దులఁ ఽ వేడితనుము
నిమ్మపండ్లమిసిమి ఽ నిరసించుఁ జెక్కులఁ
గూర్మితో నొక్కనేఁ ఽ గోరితనుము

ఇక్షుఖండముతోఁడ | నెనయైన నీమోవి
నానగా నాకెంతొ | యాశయనుము
వలరేనితూపుల | వలపించు వాల్చూపు
వశమైతి నన్నేల | వలయుననుము
గీ॥ నీదు సద్గుణపుంజంబు | నీదుయశము
వింటినీతోఁడసుఖముల | విందుగొనగ
నుంటిననుము సందేశము | నొల్లకున్నఁ
గాయజునకు నాదేహంబు | కానుకనుము.

భాస్కర ! నీవచోచమత్కృతికిఁ దగిన లేజవ్వనము నీకబ్బియున్నది. నీమోవికెంపు, నీబెళుకుచూపు, నీకులుకుటొయ్యారము స్త్రీలుగాంచిన నిన్ను నిలువనిత్తురా? స్త్రీలు లేజవ్వనప్రియులు కారా?

భాస్క—దేవా ! నేనావిషయమున మీతో నేకీభవించఁజాలను.

కామ—కొంచెమువయసు మీరుటచే నామాటలకన్నఁ బిన్నవయసుననున్న నీమాటలు స్త్రీలకడఁ బాటిగాంచు. గంభీరవాక్కులకన్న విలాసవాక్కుల వారంగీకరింతురు.

భాస్క—(స్వగతము) గంభీరమగు వీనివాక్కులే నాహృదయము నాకర్షించుచున్నవి. హృదయమా ! త్వరపడకుము—(ప్రకాశముగా) దేవా ! పోయివచ్చెద. (నిష్క్రమింతురు.)

మూఁడవరంగము—పద్మినీగృహము.

(నిత్యానందరావు, చతురిక ప్రవేశము.)

నిత్యా—చతురికా ! మామేనకోడలు పద్మిని. తండ్రిగారిపిచ్చి యింకను విడువదో.

చతు—పిచ్చులు, వెర్రిలు మీకే-ఆమెకుఁగాదు. మీత్రాగుడు, మీతందనాలుచూచి మీకు నుద్వాసము చెప్పుమన్నారు. ఇక తెరచాప యెత్తండి.

నిత్యా—ఓ సీమరాణి! ఓ మన్మథరాణి! ఓ మిఠారి! ఓ మదన కఠారి! ఒకమాట—మంచిముత్యములమూట—కోలంక మామిడిపండ తేట—ఒకమాట మాట్లాడుము.

చతు—నిత్యానందరావుగారు! ఎక్కడనేర్చితిరీచమత్కారము?

నిత్యా—నాకొకచెంప కారమైతే నీకొకచెంప పంచదారా? రుచి చూతునా? (తూలుచున్నాఁడు).

చతు—చాలులెండి మీచేష్టలు-క్రిందపడెదరు.

నిత్యా—మెత్తగా నీవుండ నాకేమిభయము?

చతు—ఎప్పుడు మీకివ్వేమాటలు-మరచితి-మీస్నేహితుఁడు శుద్ధబుద్ధావతార మేఁడీ?

నిత్యా—శుద్ధబుద్ధావతారమా! ఆతఁడీకళింగరాష్ట్రమునకెల్లఁ గొప్పవాఁడు. రోజునకుఁ బదివేలురాబడి.

చతు—విగ్రహపుష్టి నైవేద్యనష్టి. మీమేనకోడలికి మంచివరునే తెచ్చితిరి.

నిత్య—నామేనకోడలిమగఁడు నాకు కొడుకేగ.

చతు—కష్టపడకనే రోజునకు పదివేలు రాబడిగల కొడుకును గన్నారు.

నిత్యా—నీవంటిచతురికలు చల్లగానుంటే తక్కువేమి?

(నారాయణరావు ప్రవేశము.)

నిత్యా—నారాయణ! అదుగో! పద్మినిచెలికత్తె. విడువకు-వెంటఁబడు-తరుము-పోనివ్వకు.

నారా—సుందరీ! పారిపోవలదు. నీదాసుఁడ-నన్ను వాలుకన్నులతో నొక్కసారి చూడుము.

నిత్యా—తరుము-తరుము-విడువకు-విడువకు-

చతు—ఓహో! ఈభూతమును నాపైకిఁ బంపుచున్నారేమి?

నిత్యా—భూతవై ద్యుఁడ నేనుండ నీకేమిభయము. నారాయణా ! వెన్నాడి విడువకుము.

నారా—చెలి—ఇటు—ఇటు-

చతు—బాఁగు. ఈబేతాళుని తప్పించుకొనుటెట్లు. (ప్రకాశముగా) బావగారు ! ఆ—తప్పాడితి. క్షమింపుఁడు.

నారా—లేదు-లేదు-మరియొకసారి పిలువుము-మధురసముల తేనె.

చతు—పద్మినీదేవిగారు మాకు సోదరీసమానులు. ఆమెను వరించ నున్న మీరు వరుసకు భావగారయ్యెదరు. నేనామెకడకేగి మీ సుగుణ సౌందర్యముల వర్ణించిచెప్పెద. పోనిండు.

(నిష్క్రమించును.)

నిత్యా—వేసిందిరా మెత్తు. ఇంకేమున్నది.

నారా—నిత్యానందరావుగారు ! నాకు సెలవొసంగుఁడు. రేపు మా యూరు పోయెదను.

నిత్యా—ఏమియీతొందర ?

నారా—మీ మేనకోడలు నన్ను వరించదు ? విశాఖపట్నం జమీం దారుగారామెను ప్రేమించిరట.

నిత్యా—నా మేనకోడలంత తెలివితక్కువ దనుకొంటివా ? రాజులె క్కడ మే మెక్కడ. సమానవయోవారినే పెండ్లాడుదునని నాతో నెన్నిసార్లులోయనఁబట్టి నీబోటి పెద్దమనిషినినమ్మించి తీసుకవచ్చి తి. అనుమానించకు. ఏదీ-మధురసము-(బుడ్డినివిప్పి) ఇదుగో-పు చ్చుకో (ఇద్దరు త్రాగుచున్నారు.) మిత్రుఁడా ! నీకు నాట్యమం దు నేర్పుకలదా ?

నారా—లేకేమి. భరతశాస్త్రము క్రిందనుంచి తలక్రిందుగా చదివి పారవేసినాను.

నిత్యా—మాచిన్నదానికి నాట్యమంటె యభిమానము. నాతో నె న్నడు చెప్పకపోతివేమి ? ఇక వీధులనడువనీ, పద్మనియెదుటకే గనీ, యెప్పుడైననరే. తాళంతప్పనివ్వక నృత్యముచేయుచుండు ము. పద్మినిచూచిన విడచునా !

నారా—భరతాచార్యులవారు చెప్పిన యన్నిముక్తాయింపులు నాకు వచ్చును. లయకు కుంభకర్ణుఁడను. నాట్యమునకు హిరణ్యాక్షుఁడను. కాదు-కాదు. వినాయకుఁడను. చూపమందునా.(ఆడబోయి క్రిందపడును.)

నిత్యా—వీనికి యొడలుతెలియుటలేదు. పశుకా! లేవకు. వీనిజేబులో వేసుకొని ధనమంతయుఁ దాఁగివేసెద.

(నిష్క్రమించును.)

నాలుగవరంగము—పద్మిని పడకటిల్లు.

(వినోదప్రియుఁడు చతురిక ప్రవేశము.)

చతు—కంటికిఁగనుపించక, మాయమై యిన్నాళ్లెచ్చటనుంటివి? చెప్పకపో? పద్మినీదేవిగారియొద్ద-నీపని-ఇన్నాళ్లునాకుండుటకు దేవిగారు నీతలఁదీసెదరట.

వినో—నాతలతెగిన మరీమంచిది. ఈలోకములోఁ దలపూర్తిగా లేనివారి కేభయముండదు.

చతు—ఈవిద్య నీవెక్కడ నేర్చుకుంటివి?

వినో—ఓ-పైడితల్లి-నీవే చెప్పును.

చతు—నీ హాస్యమండా?

వినో—హాస్యగాళ్లకు దేవుఁడు జ్ఞానమిచ్చుగాక-వారిపంట పండుగాక.

చతు—ఊరియో ప్రయాణమో నీకుఁదప్పదు.

వినో—ఉరేమంచిది. పాడుపెళ్లిళ్లు తప్పవన్నా తప్పుతవి.

చతు—దేనికోయొకదానికి నిలువఁబడ నిశ్చయించుకుంటివా?

వినో—ఆ, నారెండుకాళ్లపై దృఢముగా నిలువనిశ్చయించితి. ఒకకాలుజారితే రెండవకాలిపై—

చతు—రెండుజారితే-బోర్లఁబడెదవా ?

వినో—లేదు- లేదు-నీచెయ్యిపట్టుకొని పైకినిక్కెదను. త్రాగుడుమాని నిత్యానందరావు నిన్ను పెండ్లాడిన నతనికిఁ దగినదానవయ్యెదవు.

చతు—చాలు. పంచాంగము కట్టుము. అదుగో దేవిగారు వచ్చుచున్నారు.

(నిష్క్రమించును.)

(పద్మిని భీమారావు ప్రవేశము.)

వినో—దేవిగారికి జయము. జయము.

పద్మి—హాస్యగానిఁ దరిమివేయుము.

వినో—ఎవరురా! అక్కడ ? దేవిగారిని యత్తవారియింటికిఁ బంపివేయుడు.

పద్మి—నీహాస్యము బండబారినది.

వినో—దేవీ! సానపట్టింతునా ? దేవిగారికి మతిపోయినది.

పద్మి—రుజువుచేయఁగలవా ?

వినో—అమ్మా! మీరేల చింతించెదరు ?

పద్మి—నాతండ్రికొఱకు.

వినో—చండికా! పాపమాయన నరకములోఁ బడినాఁడు కాబోలు.

పద్మి—కాదు కాదు స్వర్గమందున్నారు.

వినో—స్వర్గములభించినందుకా మీరు విలపించుట మంచిమాట.

పద్మి—భీమారావు! ఈదూషకునిమాటలు వింటివా ? మర్యాద యెప్పుడు నేర్చుకొనునో ?

భీమా—లోకములోనున్న విషూచికావ్యాధులుపట్టి బాధించినప్పుడు నేర్చుకొనునేమో ?

వినో—ఓరిపిడుగా! నీకు పక్షపాతమువచ్చినా హాస్యరసమబ్బదని నిత్యానందంగారు నొక్కి చెప్పినారు.

భీమా—దేవీ! ఈశొంఠలు కూయుకూతలకు మీరు నవ్వుచుండుటచే వీరిప్రేలుడు మిక్కుటమైనది.

పద్మి—భీమారావు నీకుస్వాతిశయము మెండు. వీరు నవ్వులకాఁడు మాటలకుఁ గోపమేల? వీరు వాగెదరు. మనము నవ్వెదము. తప్పేమి?

వినో—శచీదేవి! విదూషకులపై మీకు మహాభిమానము. మికష్ట పుత్రప్రాప్తిసిద్ధిరస్తు. విదూషకుఁడు మీకుఁ బెద్దకొడుకై పుట్టుఁగాక.

(చతురిక ప్రవేశము.)

చతు—పెద్దమనిషి యెవ్వరోవచ్చి గుమ్మముకడనున్నారు. మీదర్శనమట.

పద్మి—కామపాలునియొద్ద నుండియేనా?

చతు—ఏమో! నవయువ్వన సుందరుఁడు. గొప్ప కులీనుఁడుగా నున్నాఁడు.

పద్మి—అతనితో నెవరు మాట్లాడుచుండిరి?

చతు—మీమేనమామ నిత్యానందరావుగారు.

పద్మి—మా మామకు వడలు తెలియుట లేదేమో? నీవరిగి మా మామను లోనికంపుము. (చతురికనిష్క్రమించును.) భీమారావు! నీవువెళ్లి గుమ్మములోనున్న పురుషుఁడు కామపాలుని సేవకుఁడైన, నాకు జబ్బుగానున్నదనుము. ఇంట లేననుము. ఏదో చెప్పి పంపివేయుము. (భీమారావు నిష్క్రమించును.)

వినోదప్రియా! నీహాస్యము ప్రాతపడినది. అందరకు రుచించుట లేదు. వింటివా?

వినో—అమ్మా! నోరు క్రొత్తచేయవలెను. ఈభీమారావును వంటింటినుండి వెడలఁగొట్టితిరా, క్రొత్తపదార్థములు రాగలవు, రోజు వండినదే వండడము. తినలేక నోరుచచ్చిపోయినది. ప్రాతపడినది.

(నిత్యానందరావు తాగ్రిప్రవేశము.)

పద్మి—తెప్పదు. పూర్తిగా మైమరచినాఁడు. మామా! తలవాకిట నున్నవారెవరు ?

నిత్యా—పెద్దమనిషి.

పద్మి—పెద్దమనిషియా! ఏపెద్దమనిషి ?

నిత్యా—ఏమో-పెద్దమనిషి-ఏమివివాహములో—వినోదప్రియా!

వినో—ఏమిసెలవు ?

పద్మి—తెల్లవారకముందే మామా! ఇట్లుంటివేమి ?

నిత్యా—ఎట్లుంటేని ? పూర్తిగానున్నాను. వాకిటనున్నాఁడు.

పద్మి—వాఁడెవఁడు ?

నిత్యా—ఏమో! ఏదయ్యమో ? సోకు—ఇవ్వండిమంచిది.

(నిష్క్రమించును.)

పద్మి—వినోదప్రియా! తాగ్రినవాఁడెట్లుండును ?

వినో—తడిసిముప్పందుమై యుండును. ఒక్కగుటక వేసిన హాస్యగాఁడగును. రెండవ గుటకకుఁ బిచ్చివాఁడగును. మూఁడవ వేతకు మునిగిపోవును.

పద్మి—తక్షణము వెళ్లి మామను మునిగిపోకుండఁ జెయ్యిపట్టి లేవ నెత్తుము.

వినో—స్మృతి తప్పియుండును. చెయ్యి యిచ్చిచూచెద.

(నిష్క్రమించును.)

(భీమారావు ప్రవేశము.)

భీమా—తలవాకిటనున్న పురుషుఁడు మీతో మాటలాడికాని పోఁడట. మీకు జబ్బుగానున్నదంటిని. అది తానెరుగునట. గనుకనే మాటలాడవచ్చెనట. మీరు నిద్రించుచున్నారంటిని. ఇంతకు మునుపె యది తనకుఁదెలుసునట. అందులకేమాట్లాడవచ్చెనట.

దేవీ! ఏమిచెప్పమనెదరు? మీతో మాట్లాడువరకు గుమ్మము లో గుడిముందు ధ్వజస్థంభమువలె స్థిరముగా నుండునట.

పద్మి—నేను మాటలాడనని చెప్పుము.

భీమా—ఆమాటసహితమంటిని. పోఁడట. వాకిట పస్తుపండుకొను నట.

పద్మి—ఎట్లున్నాఁడు.

భీమా—మనిషివలె నున్నాఁడు.

పద్మి—ఏమో స్తరువాఁడు?

భీమా—ఏమో? దర్శనమిత్తురా లేదా?

పద్మి—ఏకులమువాఁడు. ఎన్నేళ్లవాఁడు.

భీమా—గీ॥ బాల్యయౌవ్వనసంధిలోఁ ౯ బరగునతఁడు
పాలుకారుచు బంగారు ౯ పసిమిమిసిమి
మించియున్నవి చెక్కిళ్లు, ౯ మీసకట్టు
లేదు లావణ్యజలరాసి ౯ లేతముదురు
సందు లేజవ్వనపుతేట ౯ సాటునమ్మ.

పద్మి—అటులైనఁ దీసుకరమ్ము. (భీమారావు నిష్క్రమించును.) చతురికా! (చతురిక ప్రవేశము.)

చతు—అమ్మా ఏమందురు?

పద్మి—నామేలిముసుకందిమ్ము. (వల్లెతెచ్చి కప్పుచున్నది.)

(భాస్కరరావు ప్రవేశము.)

భాస్క—ఇంటి యజమానురాలు పద్మినీదేవి గారెచ్చట?

పద్మి—నాతో మాట్లాడినఁబ్రత్యుత్తరమిత్తును.

భాస్క—ఓ యసమాన సౌందర్యనిధీ! ఇంటి యజమానురాలు మీరైనఁ దెల్పవేడుచున్నాను. ఆమెను నేనిదివరకుఁ జూచియుండలేదు. నాయుపన్యాసము మిక్కిలి చిత్రమైనది. శ్రమపడిరచించితి. వ్యర్థమగుటకు నాకు సమ్మతముకాదు.

పద్మి—అయ్యా! మీరాక యెచ్చటినుండి?

భాస్క—సేవల్లించినదిగాక వేరుచెప్పఁజాల. ఆప్రశ్నకుఁ బ్రత్యు త్తరము నాయుపన్యాసములోనిది కాదు. ఓ లావణ్యాంబురాశీ! మీరు దేవిగారని నమ్మకమిచ్చిన నేనుపన్యసించెద.

పద్మి—సంతోషపాత్రిమురు బ్రిదర్శింతురా?

భాస్క—నే ప్రిదర్శించునది నానిజస్వరూపముకాదు. మీ రేదేవి గారు?

పద్మి—నన్నే పద్మినియందురు.

భాస్క—ముందు మిమ్ము వర్ణింపనిండు.

పద్మి—కార్యమేమో చెప్పుడు—

భాస్క—బహుకష్టపడి రచించితిని. పద్యకావ్యము.

పద్మి—వలదు. వాకిలివిడువనని పంతము పట్టితిరని మిమ్ములఁ జూడఁ బిలిపించితినేకాని మీవర్తనల వినుటకుఁగాదు. మీకు వెఱ్ఱిబట్టిన వెళ్లిపొండు. మతికలదేని ముఖ్యాంశము వినిపింపుఁ డు. నాకు వేఁడుకకిది సమయముకాదు.

చతు—అయ్యా! దయచేయుఁడు. ఇదిగో దారి.

భాస్క—చమత్కారిణీ-కొంచెమాగుము.

పద్మి—మీ రెవరు? ఏమి కావలయు?

భాస్క—అది పరమరహస్యము. ఇతరు లెవరు వినరాదు.

పద్మి—ఆరహస్య మేమో నన్నే విననిండు. (చతురిక నిష్క్రమిం చును.) అయ్యా! ఏది? మీపద్యము. ఎచ్చట నున్నది.

భాస్క—ఓమహారాణీ! నాపద్యము కామపాలుని హృదయమం దున్నది.

పద్మి—ఆయన హృదయమందా? ఏభాగమున?

భాస్క—మొదటి మెట్టుపై.

పద్మి—ఇదివర్తకే నేఁజదివితినే. తిరిగి చదువుట పునరుక్తి. ఇంక మ రేమైనఁ జెప్పనున్నారా?

భాస్క—ఓమధురవాణి! మీముద్దుముఖమొకసారి చూడనిత్తురా?

పద్మి—

ఉ. మాటలుచాలనేర్చితివి । మాముఖమేటికి ? నిన్ను దాసితో,
గాటపుఁ జెల్మిచేయుమని । కామనృపాలుఁడు బంపినాఁడె? బల్
మేటిముఖంబు చూడుమిదె,। మెచ్చగవచ్చునా? లెదో చెప్పుమా
నీటుగ నున్నదా ? నిలువ । నేర్చున ? యెండకు వాడిపోవునా ?

భాస్క—ఆహా ? అనన్యసామాన్యము. అప్రతిమానము. ఉపమానశూన్యము.

సీ. వనరుహంబులు నీదు । వదనంబునకునోడి
వనమధ్యమున నిల్చి । వంచెఁదలలు
కలువలు నీకంటి । కలిమికి నోర్వక
ముకుళించి నీటిలో । ముసుగఁజూచు
సంపఁగి నాసిక । సరిరాక లోఁగుంది
పండి నేలను గూలఁ । బడఁగనెంచు
నిల్వుటద్దంబులు । నీచెక్కులనుగాంచి
మాత్సడి గోడల । మరుగుఁ జేరు

గీ. బెళుకుచూపులు మీలను । బెదరఁగొట్టు
కుంతలశ్రేణి యళులను । గోటఁ జిమ్ము
వహ్వ ! నీమోవి కెవ్వైన । వన్నె కలదె
ముఖమునకు సాటిలేదు నీ । ముఖమెగాక.

మనవతి ! ఇట్టి నీసౌందర్యవైభవము వ్యర్థము చేతువా ? లోకమునకు దానిప్రతినివ్వవా ?

పద్మి—ఓచతురుఁడ ! నాయట్టి కఠినహృదయము కాదు. లోకమునకు నాసౌందర్యమును బ్రకటించెద. బాజారునఁ బెట్టి సాటించెద. కొనుమని మీబోంట్లఁ బిలచెద. పత్రికటనయందిట్లని లిఖించెద. మొదటిలాటు కెమ్మోవి. రెండవలాటు బెళుకుచూపులు. మూడవలాటు తెళుకుచెక్కులు. నన్ను వర్ణించుటకా మీరాజు నిన్నుఁ బంపెను.

భాస్క—ఈమెకు గర్వము మెండు. (ప్రకాశముగా) మారాజు మీయం దపార ప్రేమతో నున్నాఁడు. అందునకుఁ దగిన ప్రత్యుపకార మేల చేయరు?

పద్మి—అతఁ డెంతగాఁ బ్రేమించెను?

భాస్క—మితిలేదు.

గీ. వినుము! నిట్టూర్పులకు దిశల్ వేడియెక్క
పరగఁ గన్నీళ్లు కాల్వలై పాఱఁజొచ్చె
పద్మినీపేరు వేనోళ్లఁ బాటపాడు
వ్రాసి నీరూపుపగికించి వ్రాలునేల.

పద్మి—మీ రాజు నామున సెరిగినవాఁడె. నేనతనిఁ బ్రేమింపఁజాల. అతఁడు కులీనుఁడె. భాగ్యవంతుఁడె. సౌందర్యవంతుఁడె. సుగుణవంతుఁడె. కాని యతనియందు నాకుఁ బ్రేమలేదు. ఇదివరకే యీసంగతి వానికిఁ దెలిపి యుంటిని.

భాస్క—నాప్రభువువలె మిమ్ము నేఁబ్రేమించి శ్రమపడనుంటినా. నేనూరకుండునా? మీనిరాకరణ మంగీకరింతునా?

పద్మి—ఏమి? ఏమి చేసెదవు?

భాస్క—ఏమి చేసెదనా?

ఉ. కాచెద నీగృహాంగణము, కాలుకదల్పక నిల్చివేడెదన్
నీచెలువంబు నాహృదయ నిర్మల పేఠికన్వ్రాసిజూచెదన్
దోచెద నీదుమానసము తొయ్యలి నామము పాడిపాడి నీ
మాచల పంక్తిగింగురన మన్మథ రాజ్యము గొల్లఁగొట్టెదన్.

పద్మి—అంతవాఁడవే. మీవంశమెట్టిది.

భాస్క—నాప్రస్తుత వైభవమును మించినది, నేసత్కులసంజాతుఁడ.

పద్మి—మీరాజుకడ కేగుము. నే నతని వరింపనొల్ల. సందేశమికఁ బంపవలదనుము. నామాటలు వానికెట్లుండునో తెలుపుటకు నీవుమాత్రము తిరిగివచ్చిన రావచ్చును పోయిరమ్ము.

భాస్క—క్రూరసౌందర్యమా ! నాప్రభువు నిరాకరింపఁబడినట్లు నీవు నిరాకరింపఁబడుదువేని నీకాఠిన్యమిప్పుడు తెలుసుకొందువు కదా. (నిష్క్రమించును.)

పద్మి—"నావైభవమును మించినది. నేసత్కుల సంజాతుఁడ" అవును ! నీవు తప్పక కులీనుఁడవే. ఏమి యీచిత్రము ! వీని విలాసము ! వీని నయగారపు సొంపు ! వీని మనోహర రూపము ! వీని లేజవ్వనము ! నాకళ్లకు మిరుమిట్లు కొల్పుచున్నవి. నాహృదయమపహరింపఁ బడినది. మానసమా ! తొందరవలదు. ఆగు మాగుమాగుము. భీమారావు ! ఇటురమ్ము. (భీమారావు ప్రవేశము) ఇదుగో యాటక్కరి రాయభారి తనయుంగర మిచ్చుట విడిచిపోయెను. దీనిఁ గొంపోయి వానిపైఁ బారవైచిరమ్ము. (ఉంగర మిచ్చును.) రాజునకు లేనిపోని యాశలఁ గలిగింపవల దనుము. నేనొల్లననుము. ఆయువకుఁడు రేపీమార్గమున వచ్చినఁ గారణములఁ దెలుపుదు ననుము. పరుగునఁ బొమ్ము. (భీమారావు నిష్క్రమించును.) ఏమి యీవిపరీతము-ఈయువకుఁడే కామపాలుఁడగునేని వలదు-వలదు-ఏమి యీతొందర.

గీ. మదనశరజాల మెంతటి మహిమకలదొ
నిముషమాత్రమున నడువ నేర్చె యోజ
నములు, మార ! యీజగముల నడుపువాఁడ
వీవె కెలోన్మద్దు నెరవేర్పు మీశ్వరేచ్ఛ.

(నిష్క్రమించును.)

(అంకము పూర్తి.)





# విహారలీల.

## రెండవ యంకము.

### మొదటి రంగము.

వీధి.

(భాస్కరరావు, భీమారావిరుపక్కలనుండి ప్రవేశింతురు.)

భీమా.—ఇప్పుడు పద్మినీదేవిగారితో మాట్లాడివచ్చినది మీరేనా ?

భాస్క.—అవును. నెమ్మదిగా నడచివచ్చుచుంటిని.

భీమా.—ఇదుగో ! మీయుంగరము. దేవిగా రంపినారు. మీరే తెచ్చుకున్న నాకీశ్రమ తప్పియుండునుకద. మీరాజుగారిపై తమకుమక్కువలేదని మిమ్మునొక్కి చెప్పమన్నారు. ఇట్టి సందేశమెప్పుడైనఁ దేవల దన్నారు. ఇదివిన్నమీఁదట రాజుగారి కెట్లుండెనో తెలుపుటకుమాత్రము మీరు రావచ్చు నన్నారు. ఇదుగో పుచ్చుకొనుఁడు.

భాస్క.—దేవిగారుపుచ్చుకున్న యుంగరము నాకేల ?

భీమా.—చాలు-మీరు బలవంతముగా నామెపై వేసి వచ్చితిరి. ఇటు పాఱవేయుమని మాదేవిగారి యాజ్ఞ. (క్రింద విసరివేయును.) కాబట్టిన తీసుకొనుఁడు. (నిష్క్రమించును.)

భాస్క.—ఏమి చిత్రము. నే నామె కుంగర మివ్వలేదే. ఆమెయుద్దేశ్యమేమి ? నాపురుషవేష మామెను మోహపెట్టెనా ? కానగు నాకె వింతచూపులు చూచినది. చూపులో మోహవికారము

కనుపించినది. తప్పదు. నన్ను మోహించినది. ఆమదనవికారమే యీయాహ్వాన రూపముగాఁ బరిణమించినది. ఇది కామపాలు నియంగుళీయకముకాదు. ఆయన పంపలేదు. ఆ నన్నే - పాపము. ఆమెకోరికవ్యర్థము. పురుషవేషమా ! ఎంతపని జేసితివి ? నిన్నన నేల ?

గీ. స్త్రీలహృదయంబు నిక్కిలి స్నిగ్ధమగుట,
వేషధారుల వశమాట వింతకాదు.
చపలచిత్తులు స్త్రీలని సాటి సాటి
నిందపాలు సేయఁదగునె నీతిపరులు ?

కామపాలుఁ డీమెను గాఢముగా మోహించియున్నాఁడు. ఈమె మానసము పరాయత్తమై నాయందు లగ్నమైనది. నాహృదయమందు కామపాలుని విగ్రహము స్థాపింపఁబడుచున్నది. ఈసమస్య యెట్లుండునో ! ఈముడి విప్పువాఁ డెవరు ? కాలమా ! నీవు తీర్చవలయు. నీవశవర్తులము.

(నిష్క్రమించును.)

---

రెండవరంగము—పద్మినిగృహము.

(నిత్యానందరావు. నారాయణరావు ప్రవేశము)

నిత్యా—నారాయణా ! పంచమహాభూతములా ? మన ప్రాణముల నిలుపునవి ?

నారా—కాదు - కాదు - తిండి, తాగుడు.

నిత్యా—మీరు భారతీయోధులు. సుష్టిగా భుజింతురు. మస్తుగా మధుసేవింతురు.

నారా—ఆసేవావిధాన మెట్లు?

నిత్యా—గురువులము మేముండలేదా ?

(వినోదప్రియుఁడు ప్రవేశము.)

అరుగో స్వాములు వేళకే వేంచేయుచున్నారు.

నారా—సేవావిధానమునకు స్వాములుండవలసినదే.

వినో—త్రిమూర్తు లేక మైనారు.
నిత్యా—హాయగ్రీవులా! దయచేయుడు.
నారా—ఒక ఖదన్ నడపింతురా?
నిత్యా—ఆహా! ఏదీ యొకకీర్తన.
వినో—శృంగార రసమా—కరుణారసమా.
నిత్యా—మధురసము—మధురసము.
నారా—శృంగారము—శృంగారము.

కీర్తన.

వినో—2. వచ్చింది రామన్న పేట - వచ్చింది సోమన్నమాట।
రోత - బల్ రోత - రోత - మగడంటె నాకెంతో
రోత ॥ వచ్చింది॥
2. రమ్మంది మాపటిపూట - తెమ్మంది వరహాలమూట -
రోత - బల్ రోత - రోత - మగడంటె నాకెంతో
రోత ॥ వచ్చింది॥

నారా—మేల్, మేల్.

నిత్యా—వహ్వా, వహ్వా.

(అందరు పాడుచున్నారు.)

3. చెప్పింది నీకైనమాట -నవ్వింది నాకొకపాట - వహ్వా -
బల్ వహ్వా - వహ్వా - మగడంటె నా కెంతో రోత.
॥వచ్చింది॥

(చతురిక ప్రవేశము.)

చతు—ఏమిటి యీగోల! పిల్లికూతలు. నక్కకూతలు, కుక్కకూతలు మిమ్ములను దరిమివేయమని మాయమ్మగారు భీమారావుగారిని బంపుచున్నారు.
నిత్యా—ఓకాళికవృడీదేవి! మేము త్రిమూర్తులము.
నారా—త్రివ్యక్తులము. త్రిశక్తులము. పోలేరమ్మా, పొమ్మా.
చతు—దయచేసి నిశ్శబ్దముగా నుండుడు.

(భీమారావు ప్రవేశము)

భీమా—అయ్యలారా! మీకు మతిపోయెనా? స్మృతికలదా? మర్యాదవలదా? మా దేవిగారి మందిరము దుకాణమా! స్థలమును మన్నించవలదా? మీకు కాలనిర్ణయము లేదా?

నిత్యా—లయ తప్పితిమా? మా పాటలో మేములయతప్పితిమా?

భీమా—మీరు దేవిగారికి బంధువులగుటచే నింతవరకు నోర్చిరట. మీదుండగముల విడువవలయు. లేకున్నఁ గాలికి బుద్ధిచెప్పవలయు.

నిత్యా—మా కాళ్లగురువుగారు! కాళ్లకు మీరే బుద్ధిచెప్పండి.

వినో—కాళ్లు చల్లఁబడినవి.

నిత్యా—వెళ్లుమని యాజ్ఞాపింపనా?

వినో—తప్పేమి?

నిత్యా—మీ కేల పొమ్మనెదను. హ-హ-హ?

భీమా—మీ కాధైర్యము కలదా?

నిత్యా—మీరా! వంటలవారా? మీరు మహానీతిపరులు గనుక భూమిలో సంతర్పణలు, మధుసేవలు పనికి రావందురు. మీగరిటెకు బుద్ధిచెప్పి దయచేయుడు. చతురికా! ఏది మధురసపు బాన.

భీమా—చతురికా! దేవిగారియాజ్ఞయందు నీకు గౌరవము కలదేని వీరి యల్లరికిఁ దోడ్పడకుము. జాగ్రత్త.

(నిష్క్రమించును.)

చతు—పో- గరిటెతిప్పు.

నా:రా—కడుపుప్పట్టినంత మధురసము త్రాగి భీమారావును గయ్యమునకుఁ బిలచెద.

నిత్యా—ఆగు మాగుము. నేను యుక్తిగాఁ బిలచెద.

చతు—నిత్యానందరావుగారు! ఈరోజుమాత్రము కొంచె మోపిక

బెట్టుఁడు. నాశక్తి చూడుఁడు. భీమారావును వెర్రికుక్కను జేసి; యాడించకుంటినా నన్ను జతురిక యని పిలువకుఁడు.

నిత్యా—చెప్పు-చెప్పు. దాచకు. అదియేదో కొంచెము జారవిడువుము.

చతు—కొన్ని వేళల భీమారావు మిక్కిలి క్రోత్రియుఁడు. ఆచారపరుఁడే కాని కాలానుసారము మారువాఁడు. నటనే ప్రధానముఁగా గలవాఁడు. ఇతనికి మఱియొక పిచ్చినమ్మకము కలదు. తన్నుఁ జూచినవా రెల్ల తన్ను వలచినవారే. ఈదుర్గుణమె నాయంత్రమునకు మూలము.

నిత్యా—ఏమి చేతువు.

చతు—వలపుజా బొకటి వ్రాసి వానిదారిలోఁ బడవేసెద. వాని కన్నుముక్కు తీరువర్ణించి యుత్తర మతనికేనని సూచించెద. మీ మేనకోడలిదస్తూరి నాదస్తూరి యొకటె. భేదముండదు.

నిత్యా—భళీ! నాకు వాసనగొట్టినది.

నారా—నాముక్కులోనికి వచ్చినది.

నిత్యా—నీవ్రాతనుబట్టి నామేనకోడలు తన్ను వలచినదని నమ్మును. మేల్ మేల్.

నారా—అనిక్కులన్ని జచ్చి పెద్దగాడిదె కాగలఁడు.

చతు—కంచరగాడిదె—సందేహమా.

నిత్యా—మంచి చమత్కారము.

వినో—గొప్ప వినోదము.

చతు—మీరుమాగ్గుడు మధ్యవర్తులు. చాటుననుండి పరికింపుఁడు. నేఁడుపోయి సిద్ధింపుఁడు.

వినో—భలే. భలే. రండుపోవుదము.

(నిష్క్రమింతురు.)

మూఁడవరంగము—కామపాలుని మందిరము.

(కామపాలుఁడు, భాస్కరరావు ప్రవేశము.)

కామ—భాస్కర! నిన్న వినోదక్షియుఁడు పాడినకృతి యెట్లున్నది.

భాస్క—పలుకుపలుకునకు శృంగార మొలుకుచున్నది.

కామ—పిన్నవాఁడవే కాని యేదోయొక సుందరముఖముపై కన్ను వేసినట్లున్నది. నిజమేనా!

భాస్క—తమయనుగ్రహము.

కామ—ఆపడు చెట్టుండునో యడుగవచ్చునా?

భాస్క—

సీ. మీ దేహకాంతుల § మిసమిసవెదజల్లు
మీకిద్దరికెసాటి § మిహితలేశ!

కామ—నీకుఁ దగదుసుమ్మి § నిశ్చయం బీమాట
వయసెంతో చెప్పుమా § వన్నెకాఁడ!

భాస్క—మీకెన్నివత్సరాల్ § మించెనో పరికింప
నంతియే వయసు నా § నాతి కధిప

కామ—యీడున సరికాదు § జోఁడు కుదురలేదు
విజ్ఞోడుకోరుట § వింతనీకు

గీ. పెద్దదానితో నీవెట్లు § పెనుగఁ గలవొ?
స్త్రీలజవ్వన మింతలో § శిధిలమౌను
పూర్ణయౌవన ఫలమిచ్చి § పువ్వుబోండ్లు
నీరసించుట వారికి § నిజగుణంబు.

యువకుఁడా! మరల నొకసారి నీవాపద్మినీ గృహంబున కరుగ వలయు.

భాస్క—ఆమె మిమ్ములఁ బ్రేమించఁజాలనన్న నేమిసేయవలయు?

కామ—అట్టి ప్రత్యుత్తరము నాకక్కరలేదు.

భాస్క—ఒక నారీరత్నము మిమ్ము వలచినదనుకొనుఁడు. మీయం

దు బద్ధానురాగయై మిమ్ముల వేడవచ్చి మీచే నిరాకరింపఁ బడిన నామె కెట్లుండునో?

కామ—భాస్కర? నాప్రేమ యువతులవలపువంటి దనుకొంటివా?

ఉ. మేలము లాడనేల? నిను ⁅ మేదినిలో సతులందు గానగాఁ
జాలము ప్రేమసంపద వి ⁅ చారవిహీనలు కారె కామినుల్?
చాలు నెవారిమానసము? చక్కని ప్రేమతొ నిండినిల్వగాఁ
బాలక! మోహమే సతుల ⁅ పాలిటిదైవము మాటలేటికిన్.

నాది దివ్యమగు ప్రేమ-అట్టిప్రేమ భరితమగు స్త్రీహృదయ మెందుఁ గలదు? నాది నిజమగు ప్రేమ-వలపు కాదు.

భాస్క—మహారాజా! దేవరవారు స్త్రీమానసము పరిశోధించి చిరేమీ యుందురు కాని, దాని నిజస్వభావమరయుట కింతవరకు దివ్యప్రేమ భరితలగు యువతులు మీకు లభించనందున నట్లనుచుంటిరి. మాతండ్రిగారి కొకపుత్రిక కలదు. నవమన్మథాంగుని, మీబోటి సద్గుణభరితుని మననారఁ బ్రేమించినది.

కామ—ఆమె ప్రేమ యెట్టిది?

భాస్క—ఒరులకుఁ దెలియవలనుపడక లోననుడుకుచున్నది.

సీ. వాలుకన్నులవెంట ⁅ జాలువారెడు దాని
గన్నీటిలోఁ గొంత ⁅ కానుపించు
పేసనిగాడ్పుల ⁅ విసరికొట్టెడు దాని
నిట్టూర్పులోఁ గొంత ⁅ నిర్గమించు
మతిలేని జాడ్పున ⁅ మసలుచుండెడు దాని
వెడగుమాటలఁగొంత ⁅ విశదమగుచు
నిద్రించుచ్చక్కవడి ⁅ నిలచియుండెడు దాని
తీరులో మఱికొంత ⁅ తేటపడుచు

గీ. జిన్నబోయిన ముఖమందుఁ ⁅ జేష్టలుడిగి
చేత నిడుకొన్నఁ జెక్కిలి ⁅ చిహ్నమందు
వాడివణకెడు వాతెర ⁅ వన్నెయందుఁ
గానుపించును బరికింపఁ ⁅ గామభూప!

కామ—ఆమె జీవించి యున్నదా? లేక నిరాశచే మరణించెనా?

భాస్క—నాకుఁ దెలిసినంతమట్టు కిప్పుడు నాతండ్రికిఁ గూతురైనను గొడుకైనను నేనే—సరి—పద్మినీదేవిగారి గృహంబునకుఁ బోయివత్తునా?

కామ—సఫలమనోరథుండవై రమ్ము. పొమ్ము.

(నిష్క్రమింతురు).

## నాలుగవరంగము—పూలతోట.

(చతురిక పరుగునవచ్చి).

చతు—భీమారా వీదారినే వచ్చుచున్నాఁడు. నాప్రయోగముపాలితే తప్పక మంచ మెక్కక మానఁడు. ఇదేయుత్తరము. ఈస్తంభమునకుఁ గట్టెద. (స్తంభమునకుఁ గట్టును.) పరీవీరు! వినోదప్రియా! నిత్యానందరావుగారు. దయచేయుఁడు.

(వినోదప్రియుఁడు, నిత్యానందరావు, నారాయణ ప్రవేశము.)

అడుగో! వచ్చుచున్నాఁడు. ఇదుగో! యుత్తరము. ఆచెట్టుచాటున దాగుఁడు.

వినో—నీయంత్రము నిగ్గితే.

నిత్యా—నేతప్పక నీమెను బెండ్లాడెద.

నారా—నేనో!

(ముగ్గురు దాగుచున్నారు, చతురిక నిష్క్రమించును.)

(భీమారావు ప్రవేశము.)

భీమా—అదృష్టమా! నీదిమహిమము. నీ వాక్కుసాగి క్రీగంటఁ జూచితివా?

గీ. కులముతో నీకుఁ బనిలేదు కూళయైన
బిచ్చమెత్తుక జీవించు పేదయైన
బుద్ధిలేకున్న విద్యలఁ బొందకున్న
నీదు దయయున్న నధికుఁడౌ నిశ్చయంబు.

నాపై నీకటాక్షవీక్షణం బొక్కసారి ప్రసరింపనిమ్ము. ధన్యుఁడ నయ్యెద. పద్మినీదేవిగారు నన్నందరికన్న మిన్నగాఁ గౌరవించు చున్నారు. అందుకుఁ గారణము. నన్ను బ్రేమించెనా ? తప్పేమి

నిత్యా—ఏమిటిరా వీడిగోల ?

వినో—వాగనీ- మాట్లాడవలదు.

భీమా—వంటలవారిని మోహించిన ధనికు లెందరులేరు.

సీ. వన్నెకెక్కిన మేడ ♦ వంటలవీరన్న
కట్టించె కామమ్మ ♦ కరుణచేత
పడిపుట్లపల్లము ♦ పాకాల పాపన్న
కొనలేదె సూరమ్మ ♦ కోర్కెదీర్చ
మంచి మామిడితోట ♦ మాగాయ వెంకన్న
పాలించె నాగమ్మ ♦ ప్రాపుచేత
వడ్డికి వేవేలు ♦ వడియాల రామన్న
యివ్వడే రాజమ్మ ♦ యిల్లుజేరి

గీ. వంటబాపడయి మొదట ♦ నింటఁ జొచ్చి
వశముజేసుక వనితల ♦ వాంఛితములఁ
దీర్చి, కొల్లఁగొట్టి ధనము ♦ దివ్యవైభ
వములనొందరే పెక్కండ్రు ♦ వంటవారు.

పట్టనలె యదృష్టము. మూఁడు నిముషములలో దేవిగారిని వివాహమాడనా.

నారా—నాతుపాకిదెబ్బకు మూఁడునిముషములలో మూలఁబడవా?

వినో—ఊరకో ! ముందుకథ నడువనీ.

భీమా—భీమా ! పద్మిని దేవిగారిని బెండ్లాడినమూఁడు నెలల కెట్లుందువురా ?

నిత్యా—చచ్చి పీనుగవై యుందువు.

వినో—చిత్రము ముందున్నది. మాటలాడవలదు.

భీమా—నాయున్న తపదవికిఁ దగినట్లుందును.

సీ. సేవకజనముల ƒ సిగబట్టి శిక్షింతు,
బంధుసంఘము నెల్లఁ ƒ బాఱఁగొడుదు
నీరు తెచ్చెడివారి నిక్కుల నడగింతు
పరిచారికల నెల్లఁ ƒ బంపివైతు
వేతన మివ్వక ƒ వేధింతు భటులను,
జీతము తగ్గించి ƒ ఛండివైతు
మంగలి చాకలి ƒ మాన్యాల లాగింతు
గుళ్లుగోపురములఁ ƒ గూలనేతు.

గీ. నాదుమాటకు నెదురాడి ƒ నవ్వలేని
దేవిగారైనఁ దలమీది ƒ దేవుడైనఁ
దన్ని తరుముదు వాకిలి ƒ తలుపుదీసి
భీమరాజాధిరాజను ƒ బిరుదునొంది.

అప్పుడు నిత్యానందరావును బలిపించి యేమందునా ?

నిత్యా—ఏమందువు ? అప్పటికి నీనోరు మూతపడకుండునా ?

నారా—నోరేకాదు. నవరంధ్రములు మూతపడును.

వినో—ఆగు మాగుము.

భీమా—నిత్యానందుఁడు రాగనే, నీవు తాగ్రుడు మానుమని యాజ్ఞాపించెద.

నిత్యా—నీతరమా ? నీయబ్బతరమా ?

వినో—వెనుకకు—వెనుకకు—అదుగో వల సమీపించుచున్నాఁడు.

భీమా—(ఉత్తరముచూచి) ఈచీటి యేమైయుండును. (విప్పి పైవిలాసముచూచి) మా దేవిగారి దస్తూరి. నేను బాగుగఁ బోల్చఁగలను. ఈయుత్తర మెవరికి వ్రాసియుండురు. పైవిలాసము చదివి చూచెద. "నే మన్నించు-భీ-వురామా గారికి." ఎవరికి ? నేను న్నించు" దేవిగారు నన్నే యందరికన్న మిన్నగా మన్నించుచున్నారు.

వినో—వాలుగవలలోఁ బడుచున్నది.

నిత్యా—క్రిందను మీఁదను బెట్టి యెటులో తన కన్వయించుకొనక మానఁడు.

భీమా—చిరునామాలో నీనాలుగక్షరము లున్నవి. భీ-వు-రా-మా వీటి యర్థమేమి? మొదటి యక్షరము (భీ) నాపేరో! భీమారావు. మొదటియక్షరము (భీ) సరిపోయినది.

నిత్యా—నేచెప్పలేదా? ఏమి యంత్రము వేసినదయ్యా చతురిక.

భీమా—రెండవయక్షరమో! "వు" నాపేరునకు "వు" చివర నున్నదే. మూఁడోయక్షరమో "రా" సరిపోయినది. చివరయక్షరము "మా" ఇదెట్లు- ఓహో! తెలసినది. విడిపోయినది- చివరయక్షరము "మా" రెండవదిగ, రెండవయక్షరము "వు" చివరకు మారిన నాపేరే. పొరపాటు. గూఢముగా నందఱకుఁ దెలియకుండుట కక్షరము మార్చియుండును. ఈనాలుగక్షరములు నాపేరులో నున్నవే. తప్పదు. ఈయుత్తరము నాకే. విప్ప వచ్చును. (విప్పుచున్నాఁడు)

వినో—దారిలోనికి వచ్చినది. ప్రయోగము బాగుగఁ బారినది.

భీమా—(చదువుచున్నాఁడు)

గీ. దేవుఁ డెరుగును నాప్రేమ దివ్యమహిమ
యెవనివలచితినో యొరు లెరుగరాదు.

"యెవనివలచితినో యొరులెరుగరాదు" దీనిభావమేమి? "ఒరు లెరుగరాదు" భీమారావు! నిన్నే- వంటలవాఁడవుగాన నితరు లెరుగరాదు.

నిత్యా—వీడిగొంతు తెగ! ఏమి గొంతెమ్మ కోరికలు.

భీమా—తరువాత నేమున్నది?

గీ. ఎవరివలచితి వానినే యేలుదాన
భీవురావు నిన్ గోరితి భీతిమాని.

"ఎవరివలచితి వానినే యేలుదాన" తీరిపోయె- నేనామె సేవకుఁడను. నన్నే యేలుట! నన్నే వలచుట.

వినో — చతురికయేమి విషమునీకు సిద్ధపరచినది ?

భీమా — తరువాత వ్రాసినదేమి ? (చదువును) "ఇది నీచేతఁజిక్కినఁ బూర్తిగాఁ జదువుకొనుము - మానుము - స్థితి నీకన్న నాకు మెక్కువే. భయపడకుము.

గీ॥ పుట్టుక మొదలు కొందఱు । భోగపరులు
కొంద ఱార్జింతు రీ భాగ్యము । కొందఱి కది
తనకుఁ దావచ్చి చేరును । దప్పకుండ
విధివశముచేత నిందేమి । వింతకలదు.

"నీపై యదృష్టదేవత కనుగ్రహము వచ్చినది. స్వీకరింపుము. నీవు నీకు రాబోవు గొప్పతనమునకుఁ దగినట్లుండవలయు. నీమాంద్యమును బాఱఁదరుమవలయు. బంధువులతో బెట్టుగా నుండుము. సేవకులకుఁ జనువివ్వకు. రాజకీయవిషయములే మాట్లాడ నేర్చుకొనుము. నిన్ను వలచిన వనితనిన్ను సదా పచ్చనియంగీతో మోకాళ్లకట్లతో నుండఁజూడఁగోరుచున్నది. ఇష్టమైన నీమార్పులఁ దెచ్చిపెట్టుకొనుము. లేకున్న, వంటలవాఁడవై యుండుము." ఇంకేమి-స్పష్టము. గర్వమా ! నన్నావహింపుము-అతిశయమా నన్నాలింగన మొనరింపుము-మాంద్యమా పారిపొమ్ము. నేను రాజకీయ విషయములఁ జదివెద. నిత్యానందరావును దిరస్కరించెద. నీచుల సాంగత్యము విడచెద. దేవి నన్ను మోహించినది. అనుమానమెందులకు. పచ్చనియంగీ సదాధరించెద. ఎల్లప్పుడు మోకాళ్లకట్లతో నుండెద. ఆమెకిది యిష్టము. నాయదృష్టము పండినది. మరేమో క్రిందవ్రాసి యున్నదే. (చదువును.) "నీవు నన్నుఁ బ్రేమించిన యెడల నీనవ్వులో సదా నీప్రేమ వెల్లడించవలయు. నీనవ్వు నన్నానందింపఁ జేయును. నాయెదుట 'నీవు నవ్వుచుండవలసినదే" ఓ-మేలు- సదా నవ్వెద. నీయాజ్ఞ శిరసావహించెద.

(నిష్క్రమించును.)

నిత్యా — చతురికను దప్పక పెండ్లాడెదను.

(చతురిక ప్రవేశము)

నిత్యా—దేవీ! ఇటు- ఇటు- నీపాదము నానెత్తిపైఁ బెట్టుము.

నారా—నావీపుపై నెక్కుము.

నిత్యా—వానికేమిదురాశ కలిగించితివి? నిరాశకాగాఁ బిచ్చియెత్తకమానదు.

చతు—నిజం చెప్పండి. సరిగా పనిజరిగినదా?

నిత్యా—తప్పక-నోసాళమంటినది.

చతు—దీని పర్యవసానము చూతురా? దేవిగారియొక్క కతఁడువచ్చిన సమయమందు వినోదముచూడుఁడు. పచ్చనిరంగుచూచిన దేవిగారికి తలనొప్పి. మోకాళ్లకట్లు నవ్వులామెకిప్పుడు రుచింపవు. భీమారావుగారిపని యెట్లుండునో చూతురుగాని నావెంటరండు.

నిత్యా—నీ సేవకులము—నీ దాసులము—నీవు పాతాళమునకు రమ్మన్న దప్పకవచ్చెదము—పద—పద.

(నిష్క్రమింతురు.)

అంకము పూర్తి.






## మూఁడవ యంకము.

### మొదటి రంగము—పద్మిని గృహము.

(భాస్కరరావు, వినోదప్రియుఁడు ప్రవేశము)

భాస్క—దేవిగారి విదూషకులో.

వినో—కాదు. కాదు. వివాహమగువరకు దేవిగారికి విదూషకులతోఁ బనిలేదు. నేనామెవాగ్దూషకుఁడను.

భాస్క—మొన్న కామపాలవిభుని సేవింపవచ్చితిరే.

వినో—హాశ్యగానికి హద్దులులేవు. ఈరోజున కాశీవాసము—రేపు గయావాసము—ఎల్లుండెచ్చటనో ! తిరుగుచునే యుండును.

భాస్క—మీత్రిప్పట కిదిగో పారితోషికము.

(రూపాయి యిచ్చును.)

వినో—మీకు త్వరలో వివాహమగుఁగాక. రాబోవు పౌగమోడలో మన్మథుఁడు మీకు మీసగడ్డము లంపుఁగాక.

భాస్క—నాకవిలేకున్నను మఱియొక గడ్డమునకై పరితపించుచున్నాను. దేవిగా రింట నున్నారా ?

వినో—రండి చూపెదను.

(నిష్క్రమింతురు.)

## రెండవరంగము—ఉద్యానవనము.

(పద్మిని, చతురిక ప్రవేశము.)

పద్మి—ఆయువకునకు సందేశమంపితిని. రాగలఁడు. ఆతని బహూకరించుట కేపదార్థములఁ జేయింపమనెదవు! మాటలకన్నఁ దినుబండారమే మగవారికిఁ బ్రియము భీమారావు కనుపించఁ డేమి?

చతు—భీమారావుగారి యిప్పటివాలకము వేరుగా నున్నది. మాటమాటకు నవ్వును.

పద్మి—మతిపోయినదా? పిలువుము.

(చతురిక నిష్క్రమించును.)

ఉంగరమంపితినని కోపగించి యుండునా? లేదు. లేదు. ఉంగరము నేస్వయముగాఁ బుచ్చుకొంటినని నేరము కమ్మినాఁడే. ఉదారబుద్ధి కలవాఁడు.

(భీమారావు, చతురిక ప్రవేశము.)

భీమారావు! అట్లుంటివేమి?

భీమా—దేవీ! అహ-హ-హ- (నవ్వును)

పద్మి—నవ్వెదవేల?

భీమా—నాపచ్చనియుంగి, నామోకాళ్ళకట్టెనరుల కెట్లున్ననేమి? ముఖ్యమైనవారి కిష్టమైన.

పద్మి—ఈవాలక మేమి?

భీమా—అది నాకందినది. ఆజ్ఞలు నెరవేర్చవలయు.

పద్మి—పండుకొని శ్రమతీర్చుకొందువా?

భీమా—(నవ్వుచూ చెయ్యి ముద్దుపెట్టుకొనుచు) చిత్తము-చిత్తము మీతో వచ్చెదను.

పద్మి—ఎందు కట్లు నవ్వెదవు?

చతు—భీమారావుగారు! దేవిగారియెదుట నీవిపరీత చర్యయేల?

భీమా—"గీ. పుట్టుక మొదలు కొందఱు ౯ భోగపరులు—"

పద్మి—దీని భావ మేమి?

భీమా—"కొండతాఁజింతు భాగ్యంబు"

పద్మి—అహా!

భీమా—"కొండతికదిత తనకు దావచ్చి చేరును దప్పకుండ..."

పద్మి—ఏమిటి యీధోరణి?

భీమా—"ఈపచ్చయంగీ యెవరు మెత్తురో జ్ఞాపకముంచుకొనుడు"

పద్మి—పచ్చయంగీ!

భీమా—"మోకాళ్లు కళ్లెవరికి యిష్టమో?"

పద్మి—మోకాళ్లకళ్లు! పిచ్చియెత్తినదా?

(వినోదప్రియుఁడు ప్రవేశము)

వినో—దేవీ! కామపాలసేవకుఁడాయీవకుఁడు మీకొఱకు వేచి యున్నాఁడు.

పద్మి—ఇదే వచ్చెద నసుము. (వినోదప్రియుఁడు నిష్క్రమించును.) చతురికా! ఇతని జాగ్రత్తగా నుంచవలయు. మామ నిత్యానందరావు, నాపరిజన మితని శ్రద్ధతోఁ జూతురుగాక.

(పద్మిని, చతురిక నిష్క్రమింతురు)

భీమా—ఓహో! నిత్యానందరాయ-నీవా నన్ను సమీపించువాఁడవు. నన్ను శ్రద్ధగాఁ జూచువాఁడవు. ఈయనుజ్ఞ యుత్తరములో వ్రాసినదానికి సరిపడేయున్నది. నిత్యానందరావు నేఁబంపుచున్నదనగా నేను బంధువులతో బెట్టుగానుండుట నేర్చుకొనుటకు. మన్మథుఁడా వందనములు. నన్ను భీమారావనక "యతఁడు" అని సంకేతముగా మాట్లాడినది. మాధనా! నీదే యీ యంత్రము.

(చతురిక నిత్యానందరావు ప్రవేశము)

నిత్యా—ఎచ్చట! ఎచ్చట! ఒకవందదయ్యము లతనిఁ బట్టినా భయపడను. పలుకరింపవైదను.

చతు—ఇటు- ఇటు-

భీమా—పొండి-పొండి. నావద్దకు రాకుఁడు.

చతు—నేఁజెప్పలేదా? ఆవహించినదయ్య మెట్లువాగుచున్నదో-
నిత్యానందరావుగారు! తగుశ్రద్ధచేయమని దేవిగారి యాజ్ఞ.

భీమా—ఆ. అట్లన్నారేమి?

నిత్యా—భూతవైద్యుల రావింతునా?

భీమా—మీరందరు వెళ్లి యురివేసుకొనుడు. వ్యర్థులు-నాసంగతి
వేరు-నాసందర్భము వేరు-ముందు తెలియఁగలదు.

(నిష్క్రమించును.)

నిత్యా—మంచి విచిత్రము- ఆడదగినయాట- చీకటిగదిలో నితని
బంధించి వేడుకఁజూచెదము రండు.

(నారాయణరావు ప్రవేశము.)

నారా—నిత్యానందరావుగారు! నేనిక నోర్వఁజాలను. మీామేన
కోడలు కామపాలసేవకుని మోహించినది. ఇప్పుడు చూచి
వచ్చితిని.

నిత్యా—నీయెదుట నట్లు మాట్లాడియుండును. నీసత్తునెత్తుఁ గని
పెట్టుట కట్లొనర్చి యుండును.

నారా—ఏమి చేయమందురు?

నిత్యా—ఇల్లువెడలిపోవుచుండగా నతని దాకుటె.

నారా—నాకంటె బలవంతుఁడేమో?

నిత్యా—వెనుక నే లేనా?

నారా—మన యుద్దరిభరతము పట్టితే?

నిత్యా—నీకున్న లోపమే యిది- పద! దారికాయుము.

(నిష్క్రమింతురు.)

మూఁడవరంగము—విశాఖపట్టణమందు వీధి.

(మాధవరావు, సంజీవరావు ప్రవేశము.)

మాధ—సంజీవరాయ ! నాటి తుపాను మరపునకు రాదేమి ?

సంజీ—మాధవ ! మూఁడు నెలలైనను మరపునకు రాలేదా ?

మాధ—గీ. చదలఁబ్రాకిన యానాటి జలతరంగ
చయము నేను నా మోప్రిలఁదో చఁబడుచుండె
మునిగిపోయెనో నావలె ముద్దుచెల్లె
లెచ్చ్చటనైనను జేరెనో యెరుగరాదు.

నాప్రియసోదరి, లీల, జాడ కనుపించదేమి ?

సంజీ—ఇది విశాఖపట్టణము. ఇందుసహితము వెతికి చూతము.

మాధ—వీరాగ్రణీ ! ఎన్ని దేశములఁ జూచితిమి ? భూవలయంబు నంగల నగర, పట్టణ, గ్రామజనపదంబులనెల్ల వెతికి వేసారితిమి. ఇచ్చటమాత్రము కాంచఁగలమా ?

సంజీ—మాధవ ! నిరాశజెందకుము. ఆశగలవానికే ప్రయత్నము. దాని ఫలము.

మాధ—విశాఖపట్టణము పాలించు కామపాలుఁడు నీకు పరమ శత్రువంటివే. నీకతఁ డెట్లు పరమశత్రువయ్యె.

సంజీ—రెండు సంవత్సరములక్రింద కామపాలునకును నామిత్రుఁడు భీమునిపట్టణాధిపతికిని నొక యుద్ధము జరిగెను. ఆయుద్ధమందు నేసేనాధిపతినై కామపాలుని బంధువర్గములఁ జండాడి విజయ ముగాంచితి. ఆక్రోధానలం బింకను గామపాలునకుఁ జల్లారినది కాదు. నన్ను బట్టుటకై ప్రబలప్రయత్నములు జేయుచున్నాఁ డని వింటిని.

మాధ—అటులైన నీపురమందుఁ బ్రవేశించుట నీకపాయకరము కాదా ?

సంజీ—ఏమిచేయవలయు. నిన్ను విడనాడఁజాలక నీతో నిందుప్రవే శించితి. కాని నీవుమాత్రము పురమంతయుఁ దిరిగిరమ్ము. నేని

చ్చటనే యుందును. ఏమైన విచిత్రపదార్థములఁ గాంచిన నిదు గో! నావరహాలసంచి-నీవుదీనిఁగొనిపోయి వెత్సబెట్టుము. సాధ్య మైనంత వేగిరముర మ్మా.

మాధ—నీవుమాత్రము జాగరూకుఁడవై మెలంగుచుండుము. నేని చ్చటనే మరలఁ గలసి కొందును.

(నిష్క్రమించును.)

---

## నాలుగవ రంగము—పద్మినీగృహము.

(పద్మినీభాస్కరులు ప్రవేశము.)

పద్మి—సతీమన్మథుఁడా ?

సీ. సందేహమేటికి ? సరగున నీ పాణి
పద్మము నన్నుఁ జే ? పట్టనిమ్మ

భాస్క—నీసేవకుఁడనేను ? నిర్మలచిత్తుఁడ
నాసేవఁ జేకొను ? నాతిమిన్న

పద్మి—కామపాలునిసేవ ? కాఠిన్యమని నన్ను
సేవింపవచ్చితో ? చెలువుమీర

భాస్క—కామపాలుఁడు నీకుఁ ? గానున్న భృత్యుఁడు
వానివాఁడ నగుట ? వనిత నీకు

గీ. సేవకుఁడఁగానె ! మర్యాద ? చెప్పవలెనె ?
దయను మన్నించి నారాజు ? తనివిఁదీర్చి
వలపుచూపుల నతనిపై ? వరుసఁబరపి
ధన్యుగాఁ జేయ వేడెద ? ధవళనేత్ర.

పద్మి—కామపాలుని మాటలటుండని. అతఁ డెవరో నాకు జ్ఞాపక మేలేదు. వానివిషయ మెన్నడు నాతో ముచ్చటింపకుము. నీకు సమ్మతమేని దేవగాంధర్వముకన్న మాధుర్యమగు దివ్యగాన మొకటి నీకు వినుపించెద విందువా ! మన్నింతువా !

భాస్క—సెలవిందు. సావధానుఁడనై యున్నాను.

పద్మ—త్రిలోకసుందరా!

గీ. వెనుక నీసుందర ముఖార । విందదర్శ
నమున కలరి యుంగర మంపి । నాను, చేరి
యుండు, భావంబు తెల్లమై । యుండు, తెలసి
భామచేతనే పలికింపఁ । బంతమేము.

అటులైన. వినుము.

ఉ. కామనృపాలశేఖరుఁడు । కామసమానుఁడు దీనబాంధవుం
డామహారాజు విద్యలకు । నాలయ మంచిత కీర్తిభాస్కరుం
డామహానీయు నాఁడె విడ । నాడితి సుందర! నిన్నుఁ బెద్దగా
నామదినెన్నితిన్ గరుణ । నాపయిఁజిల్కుమ! కోర్కెదీర్పుమా!

నీదికాదని తెలసియు నాభృత్యునిచే నాయుంగరమంపి నిన్ను బలాత్కరించితినని బహుసిగ్గుపడుచున్నదాన. నాగౌరవమును నీ హృదయసమ్మోటపై నిడి సంశయపరిహారములచే నెన్నిసారులు సాగగొట్టితివోయని సందేహించుచున్నాను. నిశ్చయము దెల్పితి. రవ్వంత దాచలేదు. నిష్కలంకము. నిర్మలము. నిశ్చలము.

భాస్క—మిమ్ముఁజూచిన నాకు జాలికలుగుచున్నది.

పద్మ—ప్రేమ కది ప్రారంభదశ.

భాస్క—కాదు. శత్రువులఁగాంచి సహితము కొన్నివేళల జాలి పడుదుము.

పద్మ—నే నిరాశతో నవ్వవలసినదేనా? అయ్యో! నాగౌరవము-

గీ. హీనులకు లొంగిపోవుట । హేయకరము
గొప్పవారికి లొంగుట । కొఱతకాదు
పాడు తోడేలి నోటిలోఁ । బడుటకన్నఁ
బరగ మృగరాజు నోటను । బడుట మేలు.

(గడియారము గంటకొట్టును.)

భాస్క—అదుగో గంటకొట్టుచున్నది. ఈగడియారము మనల్నెనక సక్క్యమాడుచున్నది.

చ. అతివరో! కంటివా? యెదుట నాగడియారము ప్రాణశూన్యమై
చతురత సాటసాగ మన చందము సాధువటంచు ధీరతన్.
మతిమతులోర్తురా వ్యయము మానిని! కాలధనంబు గోలుపో
వఁదగదు. పోవగావలయు వాదములేటికి రిత్తకోరికల్?

పద్మి—మోహనాంగ! ఏమి కాఠిన్యము. నాయందు లోపమేమి? నీకీడు కానా? కులములేదా? సిరితక్కువా? సౌందర్యము లేక పోయెనా! వెనుక నా సౌందర్యము నన్యసామాన్య మప్రతిమాన ముపమాన శూన్యమంటివే. ఇంతలో మరుపా!

భాస్క—నీ వన్నిటమిన్నవే. నీ సౌందర్య మతినిర్మలము.

గీ. మలిన మింతైనయంటని మసుగుపంచ,
తాకఁబడనట్టి నిర్మల దర్పణంబు
గోటగిల్లని కేతకి మాటలేల
నీదె సరిలేని సౌందర్య నిర్మలంబు.

పద్మి—అటులైన సంశయ మేమి? నామానసము పరీక్షింపఁదలచితివా. వినుము.

సీ. కులుకు గులాబీల కుండెడుముండ్లు నా
గాటపుఁ బ్రేమలోఁ గానరావు
జలరాశిఁ గాన్పించు జలచరములు నాయ
గాధపుఁ బ్రేమలోఁ గానఁబడవు.
మంచుకొండపయిని మసలెడు మంచు నా
గంభీర ప్రేమలోఁ గానరాదు
చక్కని మెరుపున సహజమౌ చపలత
గాటపు ప్రేమలో గానరాదు

గీ. ఇట్టి ప్రేమకు నాస్పదం బెవ్వఁడైన
సార్థకము కాదె వానిదౌ జన్మమరయ,
సుఖపయోరాశి దేలఁడే? సుఖము తనకుఁ
దానె వచ్చుచుండ విడువఁదగునె నీకు?

భాస్క — నీప్రేమ యగాధమని, నిర్మలమని, దృఢతరమని, గంభీర మని నే నెరుగుదు. కాని—

గీ. నాదు మానసమార్జించు నాతిభువినిలేదు.
నిజము నామాటలు లేమ! నమ్ము.
సతులు నన్గోరి కోర్కెలు సఫలమొంద
లేరు. నీమాసలువిడచి లెమ్ము, పొమ్ము.

పద్మి — ఏమి? నీగర్వము. సతులంత చులకనైరా? నిన్ను మోహింపఁజేయు స్త్రీలేలేరా!

గీ. తోయజాక్షులచేఁజిక్కి తుదకు వారి
భానిసలవలె గుమ్మము బాయలేక
పాదసేవకు సిద్ధమై పంచపండు
వారు నీబోటి యువకులె వన్నెకాఁడ,

భాస్క — వారు కాముకులు. రాజాజ్ఞ నివర్తింపవచ్చిన నాకీమాటలు రుచింపవు.

పద్మి — నీకు రుచింపవా? పురుషుఁడవు కావా? పసివాఁడవా? నీచెక్కులు పాలుకారుచున్నవి. నాచేతివాయింపులఁగాని నీకు పురుషభావ మబ్బదు. (సమీపించును.)

భాస్క — వనితా! ఇంత తెగింపు నీబోటియుత్తమసతులకుచితమా? నేరాజసేవకుఁడ. నావిధిని నన్ను నివర్తింపనిమ్ము.

పద్మి — సుకుమారా! నన్నేల విషమపరీక్ష చేసెదవు. నీబాహుమూలమ్ముల నన్నొక్కసారి చేర్చి వలపుదీర గట్టిగ నాలింగన మొనర్పుము. తెలియదుకాబోలు. భావజుశాస్త్రము లెఱుంగవేమో? కొక్కోకము చదువలేదో! నేనన్నింట నీకు గురువునయ్యెద.

భాస్క — నే నిచ్చటనుండిన ముప్పురాకతప్పదు. వనితా—

పద్మి — నీయుపన్యాసములు కట్టిపెట్టుము. నీకు నేగురువును. ఆలింగనవిధానము నేర్పెదను. (కవుగలింపఁబోవఁ దప్పించుకొని పాఱి

పోవును.) ఆ! పారిపోతివా! కానిమ్ము. నీనిబ్బరము చూచెదనుగాక. (నిష్క్రమించును.)

(నిత్యానందరావు, నారాయణ ప్రవేశము)

నిత్యా—అల్లుడుగో! దారికాయుము.

నారా—ముందు నీవు నడువుము.

నిత్యా—కాదు. నిన్నుఁగాచి నీవెనుకనే యుండెద.

నారా—ముందునీవే!

(భాస్కరుఁడు ప్రవేశము)

ఆగు మాగుము. నన్నుగడచిపోవ నీకుఁ దరమా?

నిత్యా—నిలు-నిలు- కామపాలసేవకా! నిలు. నిలు.

భాస్క—(భయముతో) మిత్రులారా! మీకు నేనేమి యపకార మొనరించితి.

నిత్యా—మేముమిత్రులముకాము. శత్రువులమే. నారాయణా కత్తి దూయుము.

నారా—అపకారమో యుపకారమో. ఇదుగో కత్తి. (అని వెనుకకు వెనుకకు నడచును.)

నిత్యా—ముందుకు పద.

భాస్క—(స్వగతము) పురుషవేషము మాత్రము దాల్చితినే కాని పురుషోచిత కార్యముల నేర్చితినా—

గీ. వేషములఁజాల భువిలోన వేయవచ్చు
భాష లెన్నెన్నొ మిక్కిలి బలుకవచ్చు
చిత్రచిత్రపు నటనలఁ జేయవచ్చు
నిలచి నిజకార్యకరణము నేర్వగలమే. (వెళ్లబోగా)

నారా—పారిపోవలదు. (కొట్టబోవును.)

(సంజీవరావు ప్రవేశము)

సంజీవ—విడువుము-విడువుము- మీతోఁ బోర సంసిద్ధుఁడనై యున్నాను. (కత్తిదూయును.)

(రాజభటులు ప్రవేశము)

1 భటు—ఆ! అతఁడే! పట్టుకొనుఁడు.

2 భటు—ఎట్లు గుర్తించితివి? ఖైదుచేయుఁడు.

1 భటు—సంజీవరాయ! నీవు మాఖయిదీవి. నిన్నుబట్టుకొనుటకు మారాజాజ్ఞయైనది. వెనుకటి యుద్ధమున మారాజుగారి బంధువులఁ జంపిన వీఁడవు. నిన్ను బాగుగ గుర్తించితిని.

సంజీ—(భాస్కరునితో) మిత్రమా! మాధవ! నీమూలమున గదా యీపురము ప్రవేశించి వీరిచేఁజిక్కితి. రానున్నది రాకమానదు. ఇంతకుముందు నీచేతికిచ్చిన నావరహాలమూట నాకిమ్ము.

భాస్క—ఇదేమి చిత్రము! నాకు వరహాలమూట నిచ్చితివా? ఎప్పుడు? నిన్ను నే నెరుగనే! (నిష్క్రమించును)

సంజీ—నీకుఁజేసిన యుపకారమున కిదియా ప్రత్యుపకారము. చిరాయువై జీవింపుము.

నిత్యా—నారాయణా! వీఁ డెంతనీచుఁడో చూచితివా! పిరికిపంద. మనలఁజూచి భయపడి పరుగిడఁ జొచ్చినాఁడు. తనకొఱకుఁబోర సిద్ధమైనవాని నెట్లు మోసపుచ్చెనో చూడు.

1 భటు—పద-పద. నిన్ను కామపాలునియొద్దకుఁ దీసుకపోయెదము. (లాక్కొని పోవుచున్నారు.)

నిత్యా—ఆతుంటరి వీధిలో నుండకమానఁడు వెంబడింతము రమ్ము. (నిష్క్రమింతురు.)

---

అయిదవరంగము—వీధి.

(మాధవరావు ప్రవేశము)

మాధ—తుపానులో సముద్రమునఁబడి పోవుచుండ సంజీవరావు నన్నుఁ దరిఁజేర్చి నాకు మహోపకార మొనరించినాఁడు. నాచెల్లెలు లీల సహితమిట్లు తప్పించుకొనియుండెనా! ధన్యులము.

ఈసంజీవరావువెంట నే ననేకదేశములఁ జూచితి. భూలోకవిచిత్రములఁ బరికించితి. ఈకళింగరాష్ట్రమునకువచ్చి విశాఖపట్టణము నేను మేమిద్దరము బ్రవేశించితిమి. ఈపట్టణమునఁ దాస్వేచ్ఛగా విహరించ వలనుపడదని సంజీవరావు నన్ను పట్టణము జూచి రమ్మని పంపినాఁడు. తన్నిక్కడ మరల కలుసుకొమ్మనెను. ఆతఁ డిచ్చట లేఁడేమి?

(నిత్యానందరావు, నారాయణ ప్రవేశము).

నిత్యా—ఓరీ! మోసగాఁడ! పాఱిపోవనెంచితివా?

నారా—ఓరీ కృతఘ్న! ఎచ్చటికిఁ బోవెదవు.

మాధ—వీ రెవరో! నేనెరుగనే! మీఁదఁబడుచున్నారు. (కత్తిదూసి) ఓ మందభాగ్యులారా! మిమ్ముల నేనెరుగను. నాపైకిరావలదు. వచ్చినఁ జచ్చునారే.

నిత్యా—వీఁడు పిరికిపంద. నారాయణా! కానిమ్ము.

(కొట్టుకొనుచున్నారు.)

(పద్మిని ప్రవేశము.)

పద్మి—మామా! ఇదేమి విపరీతచర్య? ఇంతయాగడము తగునా! రాజపురుషులతోఁ గయ్యమాడి నా కపకీర్తి తెత్తురా! వలదు. పొండు. మర్యాద నిలుపుకొనుఁడు.

(నిత్యానందరావు, నారాయణ నిష్క్రమింతురు)

పద్మి—వన్నెకాఁడా! నాప్రియభాస్కర! నీవీకఠినముబూననగునా? వీరితోఁ బోరుటచే శ్రమచెంది యుందువు. నాయింట విశ్రమింతువు రమ్ము.

మాధ—

ఉ. ఎచ్చటనుంటివో! పరులా! యీజనమందఱు బంధుకోటియో!
హెచ్చగు పిచ్చియో! తెలియ హేతువు దీనికి, నిద్రనుంటినో.
మెచ్చగవచ్చు నీసుదతి! మేలగురూపము మాటనేర్పులన్.
ముచ్చటదీరు నీమగువ మోమువిలాసము చూడఁజూడఁగా.

ఇది యింద్రజాలమే కానీ, యీ పురము మాయమంత్రములకు స్థానము కానీ, యీ సుందరి యాహ్వాన మంగీకరించెద.

పద్మి—వచ్చెదవా? ఇంకను వైరాగ్యమేనా?

మాధ—అసమాన సౌందర్య విలాసనిధివగు నీయాజ్ఞ నుల్లంఘించఁ గలనా!

పద్మి—అది క్రమమైన మార్గము. అట్లనుము.

(నిష్క్రమింతురు.)






## నాలుగవ యంకము.

### ప్రథమరంగము—చెరసాల.

(చతురిక వినోదప్రియుఁడు ప్రవేశము)

చతు—భీమారావును బంధించి చీకటికొట్టులోఁ ద్రోయించితిని. తెగ కేకలు వేయుచున్నాఁడు. నీవు వెంకన్న దీక్షితుల వేషము వేసుకొని భూతవైద్యము చేసితివా, వినోదము చెప్పఁదరమా! ఇదుగో మీసము. ఇదే గడ్డము. ఇదే యంగీ! త్వరపడుము. కంఠము మార్చుము. (నిష్క్రమించును.)

వినో—హాస్యము కుక్కయగును, కోతియగును, పిల్లియగును. చివరకు పందికూడ యగును. ఏకూతకావలెనో యాకూతకుసిద్ధము. వెంకన్నదీక్షితులగొంతు నాకలవాటే. భూతవైద్యం, రాజవైద్యం, రణవైద్యం, పంటివైద్యం, కంటివైద్యం, యింటివైద్యం, కాలివైద్యం, చేతివైద్యం, ముక్కువైద్యం, యేమో వైద్యుల తలకాయ యెన్నివైద్యములో యున్నవి. అన్ని నాకుపుట్టగానే యుగ్గులో వసకలిపి వాగమనిపోసినారు. వినోదమంటెయీ వినోదప్రియుఁడు వెనుక తీయునా? (వేషముపూర్తికాఁగా) పద-పద. భూతవైద్యుఁడా పద. (నిష్క్రమించును.)

(చరసాలలో భీమారావు)

భీమా—ఎంతయాగడము! ఎంతపని చేసిరి!

ఉ. ఎంతటి నీచకార్య మిది యెంతటి ఘోరమొ, యెంత మోసమో,
ఎంతటి ధార్ష్ట్యసాహసము లెవ్వరివేఁడుదు నేమిసేతు నా
చెంతను గానరాఁ డొకఁడు చేయునదేమియుఁ దోచ దక్కటా!
పంతముఁ బూని నే నిటికిఁ బాపముఁ జేసితి వీరిపట్టునన్.

నిత్యనిర్మలచిత్త సకలసద్గుణ సమోపేత భూతదయార్ద్రహృదయ పద్మ పద్మినీదేవి యీకౄరకార్యమున కొడంబడేనా? నమ్మఁ జాల నమ్మఁజాల. ఈయింద్రజాలము నిత్యానందునిదే. ఓరీ దాక్షిణ్యశూన్యా! నిరంతరసుఖసేవాయత్తచిత్తా! క్షుద్రమానవా! కనుపించవేమి?

(నిత్యానందరావు, చతురిక, వెంకన్న దీక్షితులు ప్రవేశము.)

చతు—అదుగో! ఆభూత మెట్లు పెడబొబ్బ లిడుచున్నదో.

నిత్యా—అది కామినీ దయ్యము.

భీమా—ఓరీ నీచ! నీకన్న దయ్య మెవ్వఁడురా?

వెంక—ఇది పెనుభూతము. పంచముఖీ వీరాంజనేయ! లంకాపురీ దాహకా! ఝాం—ఝాం—ఘాం—ఘాం—ఘరాం—ఘరాం భట—భట—హూం నిలు నిలు. కామినీ, శాకినీ, కాకినీ, ఢాకినీ, కుండగోకనీ, చెప్పుగీకనీ, రం-రం-రం-. ఇదే కొల్లేటికొల్లాపురీయాన, కాశీకామేశ్వరీ యాన, కంచికామాక్షియాన, తుని తలుపులమ్మయాన, పడమటి పయిడితల్లి యాన, గురువాజ్ఞ, కదలకు మెదలకు గప్ చిప్.

భీమా—వెంకన్న దీక్షితులు నామొఱవినుము. నాకు దయ్యము పట్టలేదు. నామాట నమ్ముము.

నెంక—నామంత్రమునకు తిరుగుండునా? చూడుఁడు. నాఁడు నువ్వు పేరుచెప్పినంతమాత్రమున దయ్యము పాఱిపోయినది. లేకున్న మారణహోమ మొనర్చి మసిచేయనా?

నిత్యా—దయ్యము వదలితే. పిచ్చివదలెనా?

భీమా—పిచ్చివదలెనా? నీతాగ్రుడువదలెనా?

వెంక—భూతవైద్యమైనది. ఇక రాజవైద్యము. నశ్మరిచేయవలెను. మీరు వీనిఁబట్టుకోఁగలరా !

భీమా—దగ్గరకువచ్చి చూడుఁడు. వెంకన్నదీక్షితులు ! వీరిమాటలు నమ్మవలదు. నాకు మతిపోలేదు.

గీ. వీరి కందఱు కేరీతి వెలయుబుద్ధి
యట్టులున్నది మతినాకుఁ బట్టుపట్టి
వీరుచేయఁదలచిరనన్ వెర్రివాని
పోనగ వీరికివిషమేమి పోసినాఁడ !

వెంక—మంత్రప్రభావమున దయ్యమువై తొలఁగెను కాని, మతి యింకను రాలేదు.

భీమా—భూతవైద్యుఁడా !

గీ. నమ్మనామాట- నీవది నమ్మకున్నఁ
బ్రశ్నచేసి ప్రత్యుత్తర పటిమఁగని
నాకు మతియున్నదో లెదో నమ్ముమప్పుడు
మొర్కువాఁడ నీకు మరింత మొర్కువాఁడ.

వెంక—నీ వెచ్చట నుంటివి ?

భీమా—నేగాఢాంధకారములో మునిగియున్నాను.

వెంక—అదేపిచ్చి- అదే వెర్రి- అదే మతిలేకపోవుట. ఎన్నిదీపము లున్నవి. ఎంతవెలుతురున్నది. ఎంతప్రకాశము- నీకు చీకటి గాఢాంధకారమా ! నీవు తప్పక యజ్ఞానాంధకారములోనున్నావు. గర్వాంధకారములో నున్నావు. నురభిమానాంధకారములో నున్నావు.

నిత్యా—సఘము వదలలేదా ?

చతు—అంతయు వదలినట్లే.

భీమా—దీక్షితులుగారు ! నాయందు దయజూపుఁడు. నాగర్వము నన్ను విడిచినది. నాదురభిమానము నన్ను వదలినది. మీ దాసుఁడ.

నిత్యా—చతురికా! వీనికి శృంగభంగమైనది. మిక్కిలి సాగదీసిన తెగిపోవును. ఇంతటితో విడచుట మంచిది. పోదమురమ్మా.

(నిష్క్రమింతురు.)

భీమా—వీరందరు కుట్రపన్ని నన్నుఁ బరిభవింప నెంచినారు. దేవిగారికి నిజమెఱిగించి వీరి భరతము పట్టెదను.

గీ. దేవిగారికి యీకుట్రఁ దెల్పితేని
వీరి భరతంబు బట్టక విడువ దతివ
తుచ్ఛకార్యములన్నఁ బల్కరిచ్చపడును.
ఉన్నదున్నట్లు వ్రాయుట యుచితమిపుడు.

(వినోదప్రియుఁడు ప్రవేశము)

వినో—భీమారావుగారు! ఇదేమికర్మము?

భీమా—వినోదప్రియా! ఇది మాతుంటరి త్రాగుబోతు నిత్యానందరావుపన్నిన పన్నాగము. దయచేసి నాకు కలము కాగితము సిరా తెచ్చిపెట్టి పుణ్యము కట్టుకొనుము.

వినో—ఏమి చేసెదవు? పిచ్చిమాటలు, పాటలు వ్రాతువా?

భీమ—నాకు పిచ్చికాదు. ఆతోత్తుకూతురు చతురిక నన్నుఁ బిచ్చివానిఁజేసి యాడించి యుండును.

వినో—వినోదప్రియుఁ డూరక యేపని జేయఁడని యెఱుగవా?

భీమ—నీకువలయు నన్ని పిండివంటలతో విందుచేసెద.

వినో—ఇంకేమి. నాకడుపునిండినది. (త్రేపుచు కాగితము, కలము సిరా తెచ్చి యిచ్చును. భీమారావు వ్రాయును)

వినో—పిచ్చివానివ్రాత యెట్లుండును. విదూషకుని మాటలవలెయకటావికటముగా నుండును. కుంటికుక్క నడకవలె యెగుడు దిగుడుగా నుండును. కోతికుప్పిగంతులవలె యడ్డదిడ్డముగా నుండును.

భీమా—వినోదప్రియా! నీవీయుత్తరము గొనిపోయి దేవిగారికిచ్చి నాదురవస్థ యామెతో విన్నవింపుము. జాలిపుట్టునట్లు మొఱఁబెట్టుము.

వినో—క్రొత్తగా ముండమోపిన కోమటివిధవవలె దీర్ఘములతో వెక్కి వెక్కి యేడ్చి మరిచెప్పెద. (నిష్క్రమింతురు.)

## రెండవరంగము—ఉద్యానవనము.

(మాధవరావు ప్రవేశము)

మాధ—ఇం దేదో భ్రమయుండకతప్పదు. నాకు మతిపోయిన దనుకొందునా! లేదు. లేదు.

ఉ. ఇంచుకభేదమేమి కను । పించదు భూవలయంబులోనఁ గా
న్పించదు మార్పు భూతములఁ । బింఛము లెత్తుక నాడు కేకులున్
బంచమనాదమోయనఁగఁ । బాడఁదొడంగిన కోకిలావళుల్
మించు కపోతయుగ్మములు । మింటను బారెడు పక్షిజాలముల్.

సర్వము యథావిధిగా నెప్పటియట్లు ప్రకాశించుచున్నది. పాటల కుసుమ సౌరభమిళితమగు నీమందమలయానిలంబు చల్లగనే వీచుచున్నది. పూతేనియలఁ గ్రోలి మత్తిల్లిన తుమ్మెద మొత్తముల ఝూంకారము మధురముగనే వినవచ్చుచున్నది. ఆయుదయభానుని బంగారుకిరణములు వృక్షాగ్రముల నెప్పటియట్లు గాన్పించుచున్నవి. పంచభూతముల నేవికారము గాన్పించదు. ఆముద్దుగుమ్మ యాజాళువాబొమ్మ రతిచేతి బంగారు రెమ్మ, నాకిచ్చిన యాదివ్యమాణిక్యము, మాణిక్యముగనే తోచుచున్నది. నాకుమతిపోలేదు. ఆపద్మినీదేవికి మతిలేదా—కలదు.కలదు.

గీ. భామచెప్పిన రీతిగా । భటులు పనులు
సేయుచున్నారు మారాడ । సేవకులకు
సాహసములేదు నేర్పుతో । సారసాక్షి
జాబులంపదె యొరులకు । జాణయనఁగ.

మతులందఱికి సరిగా నున్నవి. ఇం దేదో పొరపాటుండకతప్పదు. ఈసుందరాంగి యన్యూన వైభవము, సౌందర్యవిలాసము, జాణతనము మితిమీరియున్నది.

సీ. పువ్వుబోడిముఖము పూర్ణేందుడంటిమా
లేడిచిన్నెలచట లేవు లేవు
నలినాక్షికన్నులు నలినంబులంటిమా
నీటిమధ్యంబున నిలువలేదు
బింబోష్ఠివాతెర బింబఫలమంటి మా
చెట్టుచేమలలోనఁ జిక్కకొనదు
అతివచెక్కులు నిల్వ టద్దంబులంటిమా
గోడగొబ్బులయందుఁ గొట్టఁబడవు
గీ. లేమ యొయ్యార గరిమకు లేదుసాటి
భామసౌందర్యలావణ్య పటిమ కెనయె!
జవ్వనంబంత నొకచోట జతనుగూర్చి
పద్మినీదేవి సృష్టించె పద్మభవుఁడు.

ఇట్టి సౌందర్యఖని, నాకప్రియత్నముగ లభించుచుండ విడనాడఁ బాడియా! అదుగో దేవియే వచ్చుచున్నది.

(పద్మిని ప్రవేశము)

పద్మి—మనోహర! నీవింకను సంశయముతోనే యుంటివా? నీను ఖలతక్షణము బ్రాంతిని దెల్పుచున్నదే.

మాధ—లేదు-లేదు. నాప్రాణసమానమగు నీవింతవర కెచ్చట నుంటివి?

పద్మి—ప్రియభాస్కరా! నీరాకకై యెదురుచూచుచుంటిని.

మాధ—అది స్వభావసిద్ధమే,

గీ. భాస్కరుని రాకకై మది పలువిధములఁ
బద్మినీకాంత మిక్కిలి పరితపించు.

పద్మి— కాముఁడను మేసుమద్దమై కలతబెట్టి
వంతమూనక పూర్వమే పడతిఁగొనుము.

ఓసుకుమార!

సీ. కామపాలవిభుఁడు గాంక్షించియున్నాఁడు
వానిచేఁ బడకుండ వనితనేలు

మాధ—కామపాలుఁ డెవరో । కాంత నేనెఱుగను
గామభయమునీకుఁ । గలుగ దింక
పద్మి—సకలసద్గుణశీల ! । సరగున లేలెమ్మ
జాగుచేఁ గార్యము । చక్కఁబడదు
మాధ—సందేహ మేటికి । సారసాక్షిరో ! నీదు
సేవకుఁడనుగాన । సిరులమిన్న !

పద్మి—(స్వగతము)

గీ. ఇంత మార్పున కేహేతు । విందుకలదొ
చెప్పఁజాలను జాగింకఁ । జేయరాదు
కామపాలుని భయముచేఁ । గంపమొంది
పాఱిపోకుండ నీతనిఁ । బట్టవలయు.

పురోహితుఁడు సిద్ధముగ నున్నాఁడు. ముహూర్తము మించనివ్వ రాదు. లేచిరమ్మ.

మాధ—నీయాజ్ఞకు నీసేవకుఁడు బద్ధుఁడే. (నిష్క్రమింతురు.)

---

మూఁడవరంగము—వీధి.

(కామపాలుఁడు, భాస్కరుఁడు, భటులు ప్రవేశము)

కామ—(వినోదప్రియునిజూచి) వినోదప్రియా ! మిత్రమా ! ఎట్లుంటివి ?

వినో—విరోధుల కిష్టుఁడుగా స్నేహితుల కయిష్టుఁడుగా నుంటిని.

కామ—తల్లకిందులు. స్నేహితుల కిష్టుఁ డనుము.

వినో—కాదు-కాదు. స్నేహితులకే మిక్కిలి యయిష్టుఁడను.

కామ—అదెట్లు ?

వినో—స్నేహితులు నన్నుఁ బొగడి పొగడి బుద్ధిహీనుని జేయుచున్నారు. నావిరోధులో- దాచక యున్నదియున్నట్లు నన్ను బుద్ధిలేనివాఁడనుచున్నారు.

కామ — మీ దేవిగారికి నారాక యెరిగింపుము. నీవెంట రాఁ దింపుము. నాయౌదార్యము పరికింపుము.

వినో — నేను మరల వచ్చువరకు మీయౌదార్యమునకు జోలపాడెద. నిద్రపోనీఁకు. (నిష్క్రమించును.)

(సంజీవరావు, భటులు ప్రవేశము.)

భాస్క — దేవా! నన్ను గాపాడిన పురుషుఁ డఁడుగో!

కామ — గీ. ఆముఖమునాకుఁ గొత్తది యనఁగరాదు
వెనుక నేఁజూచినప్పుడు వీరరసము
చిలుకుచుండెను. రణభూమిఁ జిక్కఁడితఁడు
నాదుసైన్యము వీనిచే నాశమొందె.

ఇతఁడు నాకుఁ బరమశత్రువు. మీచేజిక్కుటకుఁ గారణమేమి?

1 భటు — మీతో నాడు నావికాయుద్ధమునచ్చి వీరభటుల ననేకులక త్తికి బలిగొన్న సంజీవరావు వీధికయ్యములో మాచేఁ గుర్తింపఁబడెను.

భాస్క — ఇతఁడు నాకు మహోపకార మొనరించినాఁడు. నానిమిత్తమాతుచ్ఛమానవులతోఁ బోరాడ సిద్ధపడినాఁడు. తుదకు నాశర్ధముకాని యసందర్భప్రలాపము లేవియో చేసినాఁడు.

కామ —

చ. మరచితివేమొ నాఁడు రణమందు మదీయ భటాళినెల్ల భీకరశరవహ్నిఁ గూల్చితివి, ఘట్టివిరోధివి, నీటిదొంగ! నీ వెరపిసుమంతలేక నరి వీధుల దిమ్మరవచ్చి తేటికో పోరపడినాఁడవో మరచిపోతివో వెన్కటిగాధ. వీరుఁడా!

సంజీ — కాముకనృపాలశేఖరా! నేను నీటిదొంగనుకాను. నీకుఁగర్భశత్రువుఁడైన నీసంజీవరాయుఁడు దొంగతనం బెట్టిదో యెరుగఁడు. నన్నిచ్చటి కొక యపూర్వప్రేమ యాకర్షించినది. ఇదుగో! ఈకృతఘ్నుఁడగు బాలుఁడు సముద్రమధ్యంబున భయంకరమగు తుపానునుండి నాచే రక్షింపఁబడియె. వీనియందు

మమకారముచే యిది శతృపురంబని యెఱిగియు వీనివెంటనిందుఁ బ్రవేశించితి. ఎవరో వీని నిర్బంధించుచుండ వారితోఁ బోరసం సిద్ధుఁడనై మీభటులకుఁ జిక్కితి. ఈబాలకుఁడు నాకష్టములఁ బాలుగొనక భయపడి నన్నెఱుగనట్లు నటించినాఁడు. నాచే యర ఘంటకింకఃయివ్వఁబడిన నారవహాలసంచిసహితమివ్వకున్నాఁడు.

భాస్క—ఇది యెట్లు సాధ్యము ?

కామ—ఈపట్టణమునకు మీ రెప్పుడు వచ్చితిరి ?

సంజీ—దేవా ! ఈరోజుననే. మూఁడునెలలనుండి మేము జంటబా యలేదు.

కామ—అది మఱిలేనిమాట. ఇతఁడు మూఁడుమాసములనుండి నన్నొక నిముషమైన విడిచియుండలేదు.

(పద్మిని, వినోదప్రియుఁడు ప్రవేశము.)

కామ—అదుగో ! నామన్మథరాణి—

గీ. నాకమే భూమిపై దిగి నడువసాగె
మదగజంబుల నడకలు మంచి యంచ
నడక లీద్విరదగమన, నడకసాటి
కావననతి శయోక్తులు కావుసుమ్మి.

పద్మి—నరాధిపా ! నన్ను రావింపఁ గారణమేమి ! ప్రియభాస్కర నీవాగ్దానము మఱువ నగునా ?

భాస్క—అమ్మా! ఏమి శలవు ?

కామ—పద్మినీదేవి !

పద్మి—భాస్కరరాయ ! ఏమనెదవు ?

భాస్క—నాప్రభువు మాటలాడుచుండలేదా ?

పద్మి—రాజో మా !

సీ. వెనుకపాడినపాట వేమారువింటిని
తలనొప్పినచ్చె నా తరమె వినఁగ.

కామ — ఇంతిరో! కాఠిన్య మింకను బూనెదె!
రమణి నీహృదయంబు రాయిసుమ్మి.
పద్మి — వింత మ్మేమన్నది వెనుకఁ దెల్పితిగాదె,
మారదు నాబుద్ధి మహితలేంద్ర!
కామ — ఏమని వేడుదు నెంతకాఠిన్యమే
యెలనాగ మూర్ఖత్వ మేలనీకు?

గీ. జాణవనియెంచి నన్నేలు చానవంచు
సాటిలేరంచు వన్నెల సానివంచు
నీకు నెనయైన కాంతల నీరజాక్షి!
కంచు దివిటీలవెతకినఁ గానమంచు.

నమ్మిగోలుఁబోతిని. మగువా! నన్నేమి సేయమందువు.
పద్మి — మీకేది యుచితమని తోచిన నది యొనర్పుఁడు.
కామ — పద్మినీదేవి! నాహృదయమందు క్రూరత్వమునకుఁ దావు లేదు. కాని నీక్రూరత్వము నాహృదయమునఁ బ్రవేశించినది. నీవు నన్ను నిరాకరించుటకుఁ గారణము నాకుఁ దెలియకపోలేదు.

ఉ. ఎరుగుదు నీదుకోర్కెలిట నెవ్వరిమీఁదను నిల్చియున్నవో,
ఎరుగుదు నాకు నడ్డమయి యెవ్వఁడు నీహృదయంబుఁజొచ్చెనో
ఎరుగనియట్లు నాయెదుట నెవ్వఁడు బాలునిరీతి నిల్చె యా
నరపశువున్ నరాధముని నాశముచేసెద నమ్ము భామినీ!

బాలకా! రమ్ము. నిన్ను మనసారఁ బ్రేమించితిని. నాహృదయమంతనీకెరింగించితి. నిన్ను పూర్తిగా నమ్మితి కాని—

గీ. క్రూరసౌందర్యరాశికై కోపగించి
ప్రేమకాన్పనుఁ దైనట్టి పిన్నవాని
జంప నెంచితి దయమాని. జాలరిఁ గను
చేపకొఱకు నెట్టునఁజంపుఁ జింతలేక.

భాస్క — దేవా! నాకు చావన్న భయములేదు. మీకొఱకు, మీపరిశాంతికొఱకు, మీహృదయశాంతికొఱకు, నేనెన్నిచావులు చావుమన్నఁ జచ్చెదను. సంసిద్ధుఁడనై యున్నాను. మీచే మీ

కరవాలముచే నాహృదయ మెవ్వనియందు లగ్నమై యున్నదో యట్టి నాపతిభువుచే మడయుట కన్న సుఖముకలదా? జాగేల చేసెదరు. రండు పోదము.

పద్మి—భాస్కర! ఎచ్చటికిఁ బోవుచుంటివి.

భాస్క—

ఉ. ఎవ్వనియందు నాహృదయ మెప్పుడు నిల్చి విరాళిజెందునో
ఎవ్వనిఁజూడకున్న నొక యేఁడుగ నెంతునో, పావుఘంట యే
జవ్వనమూర్తికై సకల సంపద దేహము మానప్రాణముల్
నొవ్వక నిత్తు నాతని మనోహరమూర్తినిఁ గొల్వఁబోయెదన్.

పద్మి—అయ్యో! నన్నెంత మోసపుచ్చితివి.

భాస్క—నిన్నెవరు మోసపుచ్చిరి? నీ కెవరపకార మొనరించిరి?

పద్మి—నిన్న నీవేమరచితివా? ఇంతలోనే మరుపా! పురోహితుని బిలిపింతునా?

కామ—బాలకా! రారమ్ము.

పద్మి—దేవా! ఎచ్చటికి? భాస్కరా! నాప్రాణనాయకా! నిలువుము.

కామ—ప్రాణనాయకుఁడా!

పద్మి—ఔను. అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన ప్రాణనాయకుఁడే! కాద నఁగలఁడా?

కామ—బాలకా! నీవామె భర్తవా?

భాస్క—కాదు. దేవా! నేనుకాదు.

పద్మి—అయ్యో! నేనేమిసేతు. కామనృపుని భయముచే నావిభుఁడు నన్ను నిరాకరించుచున్నాఁడు. (పురోహితుఁడు ప్రవేశము) అయ్యా! ఇతఁడు నాకేమౌనో నిజము దెల్పుము.

పురో—ఇతఁడీమె భర్త. నేనావివాహమునకుఁ బురోహితుఁడ. రెండుఘంటలకిందట వీరి వివాహము పూర్తియైనది.

కామ—గీ. ఓరి ! నీచుఁడ దుష్టుఁడ ! ఓరి చనటి
యెన్ని నేర్చితి విప్పుడే యికను ముందు
నెంతవాఁడవయ్యెదవో నే నెరుగఁజాల
కాంతఁ జేకొమ్ము పోపొమ్ము కఠినకర్మ.

ఓరీ తులువ ! ఈ కాంతను నీవే యేలుకొనుము. నీముఖముజూపక నెందైన లేచిపొమ్ము.

(నారాయణరావు ప్రవేశము)

నారా—రణవైద్యుని పిలిపింపుఁడు. రణవైద్యుని రావింపుఁడు. నిత్యానందరావుకొఱ కెవరినైనఁ బంపుఁడు.

పద్మ—ఏమిటీ ఘోరము.

నారా—వాఁడు నాతలనిలువునఁ బగులఁగొట్టినాఁడు. నిత్యానందరావునకుఁ గూడ దేహాశుద్ధిచేసినాఁడు. డబ్బుపోయినది. ఒడలు విరిగినది. నాకర్మము. ఇంటిపట్టునఁబడియున్న నాకీతిప్పలుండవు కదా ?

పద్మ—నారాయణరావుగారు ! ఇట్లెవరొనర్చిరి ?

నారా—అఁడుగో ! భాస్కరుఁడు. వాఁడె పిరికిపందయనుకున్నాము. భారతయోధుఁడు.

కామ—నా రాజపురుషుఁడు. ఈభాస్కరుఁడేనా ?

నారా—అవును. ఆభాస్కరుఁడే ! వ్యర్థముగా నాతలబగులఁగొట్టితివే. నిత్యానందరావుపోరు పడలేక నిన్నుఁదాకితిని.

భాస్క—నన్నేల దూషించెదవు ? నేను నిన్నుఁ గొట్టలేదే ! నన్నుఁ గయ్యమునకుఁ బిలిచితివి. నేఁబ్రాఁతివచ్చితిని. కొట్టలేదే ?

నారా—నాతలపగులగొట్టఁ లేదందువా? ఏమి సత్యసంధుఁడవు !

(నిత్యానందరావు ప్రవేశము)

అడుగో నిత్యానందరావు కుంటుచూ వచ్చుచున్నాఁడు. అతఁడు తాగియుండెను. లేకున్న నీపని తెలిసియుండును.

కామ—ఓఘనుఁడా ! నిన్నెవరుకొట్టిరి ?

నిత్యా—ఎవఁడో—వాఁడేకొట్టినాఁడు. వైద్యుఁడేఁడీ ?

వినో—రంగఁడు పూర్తిగానిండి తాండవమాడుచున్నాఁడు.

పద్మ—వీరిద్దరిని దీసుకవెళ్లి కట్లుకట్టింపుము. (వినోదప్రియుఁడు, నిత్యానందరావు, నారాయణ నిష్క్రమింతురు.)

(మాధవరావు, ప్రవేశము.)

మాధ—గీ. దేవి ! నీబంధుజనములఁ ౯ దెగువబూని
కొట్టినాఁడను. క్షమియింపు ౯ కోపగించ
వలదు, పైఁబడి ఢీకొని ౯ వారెనన్నుఁ
జంపఁజూచిరి మర్యాద ౯ సరణిమీరి.

(అందఱాశ్చర్యపడుదురు.)

కామ—ఇదేమి ? ఇంద్రజాలమా ? వీరి కిద్దరికి భేదమించుక గాన రాదు. ముఖము, మాట, దుస్తులు, స్వరూపమొకటే. ఏమి చిత్రము.

మాధ—సంజీవరాయ ! నీరాకకై నేనెంత పరితపించుచుంటిని.

సంజీ—నీవు మాధవుఁడవేనా ?

మాధ—ఏల యనుమానించెదవు ?

సంజీ—నారింజపండు మధ్యకు విభాగింపఁబడినట్లు భాగింపఁబడితివా? మీకిద్దరకు భేదము కనుపించదేమి? మీలో నామాధవుఁ డెవరు ?

పద్మ—ఏమి యీ యాశ్చర్యము ! ఏమి యీ విపరీతము !

మాధ—గీ. సకలదిక్కులఁ గనుపించు ౯ శక్తిలేదు
లేఁడు, సోదరుఁ డొకఁడైన. ౯ లేమ యొకతె
కలదు, నాతోడఁబుట్టిన ౯ కలువకంటి,
ముద్దుచెల్లెలు జలధిలో ౯ మునిగిపోయె.

నాస్వరూపవేషముల ధరించిన యోవన్నెకాఁడా! నీవు నాకేమి య్యెదవు ? నీ దేశ మేది ? నీనామమేమి ? నీతండ్రియెవరు ? •

భాస్క—సీ. వెలలేని మణులచే వెలిగెడి ఫణులతో
వర్ధిల్లు లోకంబు వసతినాకు

మాధ—(నాగలోకమా. నాజన్మస్థానమదియె.)

భాస్క—పుణ్యాత్ములైనట్టి భోగుల నేలెడు
భానుఁడు నాతండ్రి పాపఱేఁడు

మాధ—(నాగరాజు-భానుఁడా! నాకుతండ్రి యతఁడే.)

భాస్క—కల్యాణ గుణములకాలవాలమయిన
మాన్యుండు నాయన్న మాధవుఁడు

మాధ—(మాధవుఁడా నేనే. ఇతఁడు పురుషుఁడేనా.)

భాస్క—గీ. భూమి విహరింపఁగోరిక బుట్టమాకుఁ
జొచ్చినారమీ లోకమం దిచ్చఁ దిరుగఁ
దోఁడబుట్టిన యన్నను దోసి జలధి
తిరుగుచున్నాను దేశముల్ తెరువులేక.

మాధ—నాసోదరిని సముద్రమున కొప్పగించితినే. నీవునిజముగాఁ బురుషుఁడవేనా? నీకంఠధ్వని యట్లేయున్నది. నాప్రియసోదరీ మణీ! లీలా! జాగేల?

భాస్క—అన్నా మాధవ! (కౌగలించుకొనుచున్నారు) సముద్రము న వడసితి నన్నొంటిని.

మాధ—గీ. దేవి! [illegible]డి నావురే! దివ్యమైన
నాడు సోదరిరూపము నచ్చెనీకు
సోదరికిమారువచ్చె గా సోదరుండు.
ఇద్దఱకు మాకునాతివి యిందుపయిన.

కామ—పద్మినీదేవి! హాశ్చర్యపడకుము. విధికృత మట్లున్నది. ఇతఁడు. కులీనుఁడు. గుణవంతుఁడు. రూపవంతుఁడు. పరిగ్రహించి సుఖింపుము. బాలకా! నన్నుఁ బ్రేమించిన ట్లీసతులఁ బ్రేమింపవంటివే?

భాస్క—గీ. వినుము సూర్యుని తేజము విడచిపోని.
జలధి జలశూన్యమైపోని జగముగూలి

వై మొగిరిపోని కలగిరు  లేమకూలి
పోని నీమీదినాప్రేమ  పోదుసుమ్మి.

కామ—బాలక ! ఏది నీహస్తపల్లవము. నన్నుఁ బరిగ్రహింపనిమ్ము.
(చెయ్యిపట్టుకొని)

గీ. అబలవై యుండి మగవారి  కందరాని
చెయిదముల్ చాల చేజేతఁ  జేసినావు
నీచదూత్యంబు పనిబూని  నెరపినావు
తత్ఫలంబుగఁ జేకొమ్ము  తన్వినన్ను.

(వినోదప్రియుఁడు ప్రవేశము.)

వినో—దేవి-భీమారావు మీకేమోవ్రాసి పంపినాఁడు.

పద్మ—వినోదప్రియా ! ఉన్నది యున్నట్లు చదువుము.

వినో—పిచ్చివాని యుత్తరము చదువతగినవాఁడు విదూషకుఁడే-
(చదువును)

"దేవి ! దేవునియెదుట." (ఏడ్చును.)

పద్మ—నీకునహితము పిచ్చిపట్టెనా ?

వినో—పిచ్చివాని యుత్తరము యథావిధిగాఁ జదువమంటిరే.

పద్మ—చాలు. ఇటు తెమ్ము. (చదువుకొనును)

పాపము-అతని బందిబాపి యిట[illegible]పుము. నృపాలశేఖ
రా! మీవివాహము మాయింటజరుగుటకు సమ్మతింపవేడెద.

కామ—నిన్ను నాసోదరిగాఁ బరిగణించెద. నీయిచ్ఛానుసారము
జరుగనిమ్ము.

(వినోదప్రియుఁడు భీమారావు ప్రవేశము)

ఇతఁడేనా మతిలేనివాఁడు ?

పద్మ—భీమారావు-ఎట్లున్నది.

భీమా—దేవి— నన్నిట్లేల యవమానించితివి ?

పద్మ—నేనా. లేదు-లేదు.

భీమా—ఈయుత్తరము దేవిగారు వ్రాయలేదా ?

(ఉత్తరమిచ్చును-దేవి చదువును)

పద్మి—భీమారావు! ఇది నేవ్రాసినదికాదు. నాదస్తూరి పోలియున్నది. పాపము, నమ్మితివికాబోలు! ఇది చతురికవ్రాత. నీకు మతి పోయినదని మొదట్నాతోఁ జెప్పినది చతురికే. ఇట్లు చేయుటకుఁ గారణము విచారింతము. సహింపుము.

వినో—దేవి! పిచ్చివానికి విదూషకుఁడు ప్రబలసాక్షి-నాసాక్ష్యము వినుఁడు. భీమారావు మీసేవకులమగు మమ్ము నిర్లక్ష్యపెట్టట చే-నితనికి శృంగభంగముచేయ మేమందఱ మీపన్నాగము పన్నితిమి. క్షమింతురుగాక-చతురిక యీజాబు వ్రాసినది. ఈవినోదము నిగ్గిన నిత్యానందరావుగారు చతురికను కట్నములేకనే వివాహమాడ నొప్పుకొనిరి.

కామ—ఇట్టి యానందసమయమున నిత్యానందరావును చతురికను గలుపుట మంచిది.

(చతురిక నిత్యానందరావు ప్రవేశము)

(వినోదప్రియుఁడు వారిచేతులు కలుపును.)

వినో—గీ. పుట్టుక మొదలు కొందఱు భోగపరు
కొందఱాజన్మంతు భాగ్యము కొ
తనకుఁ దావచ్చి చేరును గ లదు.
విధివశముచేత సందే జదువును).

(అకట్యాం పూర్ణము .

